విశ్వసాహిత్యమాల. 41.

# నా ద్యా.

(కథా సంపుటి)

సోషిన్, పాల్ హేసీ, జె. యస్. ఫ్లెచెర్,
మపాసా, చెకోవ్, రోమనోవ్.

అనువాదం:
శాస్త్రి, జగన్మోహన్.



విశ్వసాహిత్యమాల,
రాజమండ్రి.

# భూమిక.

ఈసంపుటిలో ఆరుకథలు, సుప్రసిద్ధ కథకులవి ప్రచురించేం. చెకోవ్‌నుంచి ఫ్లెచెర్‌కు చాలదూరం; మపాసా నుంచి సోషిన్ వరకూ మాత్రం దగ్గరా? దేశకాలపాత్రాలలో ఎంతో విభిన్నతను ప్రదర్శించునవైనను చమత్కృతి, భావనాపటిమగల్గి ప్రేమకు మానవసమాజంలో గల స్థానం, తెలుసుకోడానికీ కథలు చాల తోడ్పడుతవని మా నమ్మకం. ఆయాదేశాల కథాసాహిత్యంలో ఈ రచయితలకూ, రచనలకూ ప్రముఖ స్థానం యివ్వబడింది. వీటిని చదివి మెచ్చుకొనకుండ వుండలేము.

ప్రయోజనాన్ని నిర్ణయించటం సాహసమేయని చెప్పాలి. అయిననూ మొదటి—ఆఖరికథలు నాద్యా, పెళ్లిషగతులు, అనే రెండుసోవియట్ రచనలూ యిందులో ప్రథమస్థానాన్ని పొందుతాయి. కవి రచనావైదగ్ధ్యమును అనువాదాల్లో చూచాయగా మాత్రమే చూడగలము. భాషాపటిమను మచ్చునకైన నూహించనేలేము. మరిమిగిలేది, ముఖ్యంగా కథావిధానము, మానవస్వభావచిత్రణ, సమస్యను పాఠకుని ఎదుట నుంచడం. యివే. భాషాంతరీకరణ మన్నపుడు అనువాదకుని భాషా పరిచయమే కథకు స్థూలశరీరము నేర్పరుపగలది. అందుచేతనే ఒకవిధంగా అనువాదం జయప్రదం కావాలంటే మూలరచయిత ప్రధానభావాన్ని ఆకళింపు చేసికొనివుండాలి. అప్పుడే భావాత్మకు తగిన భాషా శరీరాన్ని సమకూర్చగలుగుతాము. అనువాదకు లిందెంత కృతకృత్యులైనదీ చదివి మీరేచెప్పండి.

రాజమండ్రి,
15–12–46.

ఇట్లు.
మహీధర జగన్మోహన్.
సంపాదకుడు.

D

# విషయసూచిక.

# సా ద్యా

సో ష స్

తెల్లవారుతూంది. పార్కు నిర్జనంగా వుంది.

ఆసమయంలో ఒక వృద్ధుడు ఇనుపచేతిబెత్తం మీద ఆనుకుని, కొద్దిగా వంగి నడుస్తూ నెమ్మదిగా గేట్ దాటి లోన ప్రవేశించాడు. దగ్గరగావున్న తిన్నెమీద చదికిలబడి అటూయిటూ చూస్తూ, తనచేతి బెత్తంతో గులకరాళ్ళమీద పొడుస్తూ కూర్చున్నాడు. క్రమంగా సూర్యుడు పైకెక్కి వస్తున్నాడు.

ఆసమయంలో ఒక వయసు మళ్ళిన ఆడుది ఆదారినే వచ్చింది. ఆమె చేతిలో సరుకులతో నిండివున్న ఒక సంచీ వుంది. ఆమెను చూడ గానే ముసిలివాడు నడుము నిక్కించాడు. అతని మొగంమీద ఉల్సాహం దీపించింది. కొంచెం సంకోచిస్తూ ఆస్త్రీని—"మేరియా!" అని పిలి చేడు. ఆమె వెనుతిరిగి యాతనివంక తేరిపారి చూసింది.

"నేను ఉసోప్‌ని. జ్ఞాపకం వున్నానా?"

"ఓం, ఇప్పుడు గుర్తుపట్టా....ఇవాన్‌సెమెనిచ్ కాదూ?"

"రా! ఒక్క నిముషం కూర్చో."

అతడు జరిగి, ఆమెకు చోటు చూపాడు.

మేరియా చేతి సంచి తిన్నెకు జేరపెట్టి, కూర్చుంది.

"గుర్తే పట్టలేక పోయావు" అంటూ ముసిలివాడు నొచ్చు కున్నాడు. "కళ్ళు బాగా చెడ్డట్టు తోస్తుంది."

"అందుచేగా ఫ్యాక్టరీలో పనిమానాను."

"ఇద్దరం పెద్దవాళ్ళమయిపోయాం. నేనూ పనికి వెళ్ళడంలేదు."

"ఇల్లా ఎందుకు వచ్చావు?"

అతని యిల్లు పట్టడానికి ఆకొాననువుందని మేరియా ఎరుగును.

అతడు ఈవేపునకు రాగా ఆమె యెప్పుడూ చూడలేదు. అందుకే ఆమె కాశ్చరం కలిగింది.

"నీతో మాట్లాడుదామనే వచ్చాను. నాసంగతంతా చెప్పుకుందామని."

"చాలా కాలం క్రితం నువ్వు చెప్పుకున్నవన్నీ నేనింకా మరిచి పోలేదు. బహుశా నువ్వుచేసిన పనిని సమర్థించుకుందామని నీయభి ప్రాయమనుకుంటా. కాని, అవన్నీ వదిలెయ్యి. మరిచిపో."

"మరవడం ఎల్లాగ మేరియా? పేపర్లు చదివితే ఆమె పేరు. రేడియోలో ఆమె మాట. ఎక్కడవిన్నా ఆమెను గురించే, ఏమిచదివినా ఆవిడపేరే. అల్లాంటప్పుడు ఉసోవు రక్తసంబంధం జ్ఞాపకం వస్తూనే వుంటూంది."

మేరియా తలవూపి చిరునవ్వు నవ్వింది.

"ఉసోవు రక్తసంబంధం చాలా ఉత్తమం అనుకుంటున్నావా?"

ముసలివాడు ఆవేశంతో తల విసిరాడు. "ఎందుకు అనుకో కూడదు? ఇవాన్ఉసోవంటే ఎల్లాంటి పనివాడో మరిచిపోయావను కుంటా."

మేరియా గంభీరంగా మాటకి మాట తిరగేసింది.

"మేరియా ఎంత నేర్పుగా నేతనేసేదో నువ్వు మరిచిపోయి వుంటావు. దానికేం, ఆవిడ నిన్ను పోలిందా, నన్ను పోలిందా అని ఘర్షణ పడనక్కర్లేదు....మన మిద్దరమూకూడా ఆవిడకు నేర్పింది ఏమీ లేదు. అది కొత్తతరహా పనిమంతురాలు. మన యిద్దర్నీకూడా తల తన్నింది."

ఒక్క క్షణం వూరుకుని గంభీరంగా "అదే నాజీవితానికి ఆనందం"—అంది.

"నామాటేమిటి" అన్నాడు, ముసిలివాడు విచారంతో.

"నేనూ ఎన్నో కష్టాలు పడ్డా. పోనీ ఒక చిన్న వుపకారం చేసి పెట్టు. నన్ను గురించి ఆమెతో చెప్పు. నన్ను చూడడానికి ఒప్పు కుంటుందేమో అడుగు."

మేరియా నిశ్శబ్దంగా ఎదురుగా వున్న ఒక పొదవంక చూస్తూ కూర్చుంది. తన కోరికను నిరాకరించడానికే ఆవిడ ఆలోచిస్తూందను కున్నాడు, ఆతడు.

"నువ్వు మరొకలా అనుకోకు. నాకు ఆమె యేమీ ఇవ్వనక్క ర్లేదు. ఒక్కక్షణం కూర్చుని మాట్లాడుతా, పరిచయం చేసుకుంటా. ఈముసిలితనంలో ఆమాత్రపు ఆనందానికి నోచుకోలేదు? ఈవయస్సులో నామీద ఇంకా కక్షపెట్టుకోవడం నీకు తగదు."

మేరియా ఆతనివంక సానుభూతిగా పరికించింది.

"నీమీద నాకేమీ కక్షలేదు. ఇంతకాలానికి నీకీబుద్ధి ఎందుకు పుట్టిందా అను కుంటున్నాను. అంతే. హఠాత్తుగా ఎందుకు పుట్టిందీ ఈతొందర ?"

"హఠాత్తుగానా?" అని ఉసోవు నిట్టూర్చాడు. "నావాళ్ళు అను కునేవాళ్ళు నలుగురూ దగ్గరుంటే చావు అంతభయం కలిగించదు, కాని, ఈ ప్రపంచంలో నేను ఏకాకిని. ఒక్కమాటు ఆమెతో పరిచయం చేసు కుంటే. ఆమెకు నేనెల్లా వుంటానో తెలుస్తుంది. నేను చచ్చిపోయాక నైనా ఓమాటు అనుకుంటుంది."

"సరే. చెప్పడానికి నాకేమీ అభ్యంతరంలేదు." అంటూ మేరియా లేచి, సంచీ చేతపట్టుకుంది.

"ఏదో చాలా బరువుగా వున్నట్టుంది. నేతెచ్చి పెట్టేదా?"

"ఏమంత బరువులేదు. నేను తీసుకుపోగలను. పోతా....సరే. ఆమెతో చెప్తా. బహుశా ఆమె చూడడానికి ఒప్పుకోవచ్చు. కాని, ఏసంగతీ నీకు తెలియడం ఎల్లాగ ?"

"అదేం సమస్యకాదు. రేపు ఈవేళకి ఇక్కడికి వస్తా."

"రేపు వద్దు. రోజు విడిచి రోజు వస్తూంటాను బజారుకి."

"అయితే సరే. ఎల్లుండే వస్తా." ఇనపదెత్తం మీద ఆనుకుని ఉసోవు లేచాడు.

"బహుశా ఆమె నిరాకరించవచ్చు. చిన్నప్పటినుంచీ తండ్రిని గురించి నూరిపోసి వుంటావు."

"అదయినా మేలే. ఇన్ని ఏళ్ళుగా ఒక్కమారుకూడా నీవిషయం దానిముందర ఎత్తలేదు. తనతండ్రిని గురించి పైవాళ్ళనుంచి ఏమన్నా విన్నదేమోగాని, నేనుమాత్రం నోరు మెదపలేదు."

ముసిలివాడు విచారంతో తనచేకర్రను నేలలో లోతుగా గుచ్చాడు. కాని, అంతలో సర్దుకొని, కర్ర లాగివేసి, కన్నంలోకి కాలితో మన్ను కూరేడు.

మాషా తనవూరు విడిచి, మొట్టమొదటిమారు మిల్లులో పనికి వచ్చిన నాటికే ఉసోవు ఫోర్మనుకు అసిస్టెంటుగా వుండేవాడు. మంచి బలంగా, చురుకుగా, ఎర్రని బుగ్గలూ, అందమైన జుట్టూ గల ఆపల్లెటూరి పిల్లమీద ఆనాడే ఆతని కన్నుపడింది. ఉసోవుకి అప్పటికే కొంత పేరుంది. మనిషి నీటుగా, అందంగా వున్నాడు. ఆతని పలకరింపుల్ని మాషా సిగ్గుతో, చిరునవ్వులతో స్వీకరించింది. తర్వాత ఫ్యాక్టరీగేటువద్ద తరుచుగా కలుసుకోవడం సాగించారు. తలమీద ఓరగా పెట్టిన ఆతని సీలిటోపీ కంట బడగానే, ఎంతమంది వున్నా మాషా లేచి వచ్చేసి ఆతనితో బయలుదేరేది.

అరోజుల్లో పార్కుల్లోకి కార్మికుల్ని చేరనిచ్చేవారుకాదు. అందుచేత ఫ్యాక్టరీల్లోని కూలిపడుచులు, కుర్రవాళ్ళు పట్టణం వెలుపల దూరంగావున్న చిట్టడవులలోకి షికార్లు కొడుతూండేవారు. మాషా—ఉసోవులుకూడా, అచిట్టడవిలో కాస్త విశాలంగా వున్న ప్రదేశంలో

పచ్చికమీద కూర్చుండి మిల్లును గురించీ, తమకు వచ్చే జీతాన్ని గురించీ మాట్లాడుకొనేవారు. మగ్గంబాగులేదనీ, ఆసు సరిగ్గా అడ్డంలేదనీ, ఫోర్మను, మాస్టరువీవర్ల దుర్లక్షణాలని గురించీ మాషా చెప్పుతూండేవి. ఆమాదిరి విషయాలు చర్చించడం ఉసోవుకి ఇష్టం వుండేదికాదు. అందు చేత విషయం మార్చేసేవాడు. మగ్గాలు తాను అద్భుతంగా సరిచెయ్య గలనని చెబుతూ, నేతపనిచేసేపడుచులు తనకోసంక్రిందుమీదవుతున్నారని గొప్పలు చెప్పేవాడు. ఈవిధంగా ఆమెలో ఈర్ష్య రగిల్చి, తనవేపు లాక్కోవాలని ఆతని వూహ. ఎంతోకాలం ఆమె వెంటబడి తిరిగాడు.

"నాకు వుండడానికంటూ ఒక ఇల్లు ఇవ్వంగానే మనం చర్చికి పోయి...."

"పెళ్ళికానిదే నీకు ఇల్లు ఇవ్వరుగా" అని ఆమె నవ్వుతూ సూచించేది.

"ఇచ్చి తీరుతారు. అసలు వాళ్ళని పోయి కలుసుకున్నాకాదూ? ఒకళ్ళిద్దరికి చెయ్యి తడికూడా చేశాను."

వారిస్నేహం కలిసి రెండోఏడు నడుస్తుండగా ఒక రోజున మాషా తాను గర్భవతి నైనానని చెప్పింది.

ఉసోవుకి ఏమిచేయాలో ఏమీ అర్థం కాలేదు. మాషా అతను చేసిన వాగ్దానాన్ని జ్ఞప్తికి తెచ్చింది.

"రేపు పోయి వాళ్ళగొంతుపట్టుకు అడుగుతా. వెంటనే యిల్లొకటి ఇచ్చి తీరాలని కూర్చుంటా."

ఉసోవు దృఢనిశ్చయం చేసుకున్నట్లు నటించాడు.

కాని, ఆరోజు మొదలు ఇంక ఫ్యాక్టరీగుమ్మంవద్ద ఆమెను కలుసుకోడానికి రావడం కట్టిపెట్టాడు. ఆతని బుర్రలో తిరుగుతూన్న వుద్దేశ్యాలు వేరు. తనో మాష్టరువీవరు కావాలనీ, ఓయిల్లూ, మంచిదొడ్డీ

కొనుక్కోవాలనీ ఆతడు కలలు కంటున్నాడు. ఆశీతాకాలంలోనే ఒక కుట్టుపనివాని కూతుర్ని పెళ్ళి చేసుకున్నాడు. ఆమె తనతో పెద్దసారె కూడా తెచ్చుకు వచ్చింది.

మాషాకు ఆడపిల్ల కలిగింది. పురుడు వచ్చిన మూడోరోజునే ఆమె పనిలోకి వచ్చింది. చర్చిలోనిగురువు బిడ్డకు 'నాద్‌జ్యాదా' (ఆశ) అని పేరు పెట్టి బాప్టిజం ఇచ్చాడు. ఇంటిపేరు పెట్రోవ్ అని వ్రాసాడు. మాషా ధనానికి చాలా ఇబ్బంది పడసాగింది. పిల్ల వుండడం మూలంగా ఫ్యాక్టరీహాస్టలు విడిచిపెట్టి వేరే యిల్లు అద్దెకు తీసుకోవలసి వచ్చింది. ఆమె వున్న ఇంటివారికో చిన్నపిల్లవుంది. ఆమె మాషా కూతుర్ని చూస్తూండేది. పాలివ్వవలసి వచ్చినప్పుడు తీసుకువచ్చి వప్పచెప్పేది. ఈసాయం చేసినందుకు ఆపిల్లకు కొద్దోగొప్పో ముట్టచెప్పవలసి వచ్చేది.

కొన్నేళ్ళకి ఉసోవు మాష్టర్‌వీవర్ కాగలిగాడు. మాషా కనిపిస్తే తల తిప్పివేసుకొనేవాడు. సాధ్యమైనంతవరకు దూరదూరంగా తిరిగేవాడు.

ముందువేపు పువ్వులతోట పెంచి ఒక అందమైన బంగాళా కట్టుకున్నాడు. అతని ఆశలు అంతకంటె ముందుకి సాగలేదు. భార్య ఎప్పుడూ రోగాలతో ముక్కుతూ వుండేది. పిల్లా పాపాలేరు. ఇల్లంతా బావురంటూ, ఎంతో విచారకరంగా వుండేది.

ఏళ్ళుగడిచాయి. భార్య పోయింది. వయస్సుపై బడింది. ముసిలితనం వచ్చాక తనవొంటరితనం తెలుసుకోగలిగాడు. ఉసోవ్. ఒంటరితనం, నిరుత్సాహంతో ఆతని వృద్ధాప్యం గుండెల్ని పిండివేసేది.

ఆస్థితిలో మాషా కూతురుపేరు పైకొచ్చింది. ఆమెకు యెన్నో బహుమతులు వస్తున్నాయి. ఇంక ఆతని మనస్సు మనస్సులో వుండేది కాదు. ఆమె తనకు మాత్రం కూతురుకాదూ? తనకూతురే ఇంత ప్రజ్ఞావంతురాలయిందనే గర్వంతో ఆతని హృదయం కుతకుతలాడేది.

రోజూ పట్టణంలోవున్న లైబ్రరీలన్నీ తిరగవేసేవాడు. పత్రికలన్నీ పరీక్షించేవాడు. నాద్యా(నాద్‌జ్యాదా ముద్దుపేరు) పేరు కనపడ్డ కాగితమల్లా జేబులో కూరుకొనేవాడు. నాద్యా జీవితంతో సరిపోలుస్తూ మేరియా పేరుకూడా ఉదాహరిస్తూండేవారు, పత్రికలలో అప్పుడప్పుడు. కాని, తనని గురించి ఒక్కమాటకూడా వుండేదికాదు. ఉసోవు పట్టణం అంతా తెగ తిరిగేవాడు. నల్గురు నిల్చుంటే దగ్గరికి చేరేవాడు. ఏదో సందు చేసుకుని నాద్‌జ్యాదా తనకూతురేనని చెప్పేవాడు. కాని ప్రజలు ఆతనిని లెక్కచేసేవారుకాదు. పైపెచ్చు తాటాకులుకూడా కట్టేవారు.

తాను కోల్పోయిన మహత్తర భాగ్యానికి ఆతడు చాలా విచారపడ్డాడు. విచారంతో ఆతడు మంచంపట్టి, రెండు నెలలపాటు మృత్యువుతో పోరాడాడు. వసంతంలో మళ్ళీ లేచి తిరుగనారంభించేడు. కాని, మనిషి కుదేలైపోయాడు. ఇట్టే ఉద్రేకానికి లోనయ్యేవాడు. నాద్యాపై ఆతనికిగల ప్రేమ క్రమంగా సహజమార్గాన పడింది. ఆమె గొప్పతనంలో తానూ గొప్ప పొందాలనే భావం లేదు ఇప్పుడు ఆప్రేమలో. ఆతని పితృహృదయం ఆమె పేరు వినేటంతకి ఉప్పొంగి పోయేది. ఒంటరిగా వున్నప్పుడు కూతుర్ని చూడాలనీ, మాట్లాడాలనీ, తను ఆమె తండ్రినని చెప్పుకోవాలనీ ఆతని కోరిక. ఆమె తన్ను తండ్రినిగా జ్ఞాపకం చేసుకోవాలని ఆశ.

మేరియా నిర్ణయించిన గడువు రెండు రోజులూ యుగాలవలె తోచాయి. పెట్టెలోంచి శుభ్రమైన దుస్తులు తీసాడు. మరకలు, ముడతలు లేకుండా శుభ్రపరిచాడు. ఎండలోవేసి మడతలు పెట్టాడు. పెట్టెలోంచి వెండి జేబుగడియారం తీసి 'కీ' యిచ్చాడు.

గడువురోజున పెంద్రాళే లేచి, వొళ్ళు కడుక్కున్నాడు. గడ్డం గీసాడు. సిద్ధంచేసి వుంచుకున్న తన మంచిదుస్తులవేపు ఒక్కమారు పరకాయించి చూసాడు. "ఇది తొడుక్కోనా, వద్దా!" అని ఒక్క

నిముషం జిజ్ఞాసపడ్డాడు. ‘ఒకవేళ చూడడానికి ఆమె ఒప్పుకోకపోతే?” మళ్ళీ కాళ్ళు ఈడ్చుకుంటూ తిరిగి రావాలి. మొగం ఎరికగలవాళ్ళు తన దుస్తులుచూసి, పిలిచి “ఉసోవ్! ఈవేళ టిప్‌టాప్‌గా వున్నావు. ఏం వ్యవహారం?” అనడుగుతారు. వాళ్ళకి ఏం చెప్పాలి? ఆదుస్తులు వేసుకోకుండడానికే చివరకు నిర్ణయం చేసుకున్నాడు.

పార్కులోకి వెళ్ళేటంతకి ఇంకా పొద్దు పొడవలేదు. చెట్లమధ్య ఏమిటో వెతుకుతూ ఒక పడుచు పార్కులో అటూయిటూ నడయాడుతూంది. పార్కులో రెండోకొసని, మేరియా యింటివేపు ద్వారంవద్ద ఉసోవు ఒకతిన్నె నాశ్రయించాడు.

మేరియా వచ్చేటంతకి ఎనిమిది దాటింది. ఆమెను చూచి ఉసోవు ‘అమ్మయ్య’ అనుకున్నాడు.

“నువ్వు పెంద్రాళే నిద్ర లేవ వనుకుంటా. కదూ?”

“చాల సేపయిందా నువ్వు వచ్చి?”

“ఆ. ఏమయింది?

చాలా గంభీరస్వరంతో మేరియా “నేను దానితో చెప్పాను. నిన్ను చూడడానికి వొప్పుకుంది. అయిదు గంటలకి రా మాయింటికి. ఎరుగుదువుకాదూ. మాయిల్లు” అంది.

“లెనిన్ పేటలో అని తెలుసును. కాని ఎక్కడో, ఏయిల్లో ఎరగను.”

తమ చిరునామా ఆతనికి వ్రాసి యిచ్చి, ఆమె బయలుదేరబోయింది.

ఉసోవ్‌కూడా లేచాడు. తూలిపోతూ ఆమెతోకూడా కొంతదూరం నడిచాడు. “ఈవేళ నాకు పండుగ” అన్నాడు. ఆతడు ఆనందంతో.

మేరియా ఆతనివేపు ఓరగా చూస్తూ నిట్టూర్చింది. “ఇవాన్! రత్నాన్ని వొదులుకున్నావు. ఆరోజుల్లో ఎంతకోపంగా వుండేదో

నాకింకా జ్ఞాపకం. కాని, నిలదొక్కుకున్నాను. ఆ చాలీచాలని జీతంతోనే నాద్యాను పెంచి పెద్దదాన్ని చేశాను."

"నిజం. రత్నాన్నే పోగొట్టుకున్నా. దానిమీద అధికారం లేకుండా చేసుకున్నా. నిన్ను బాధపెట్టా. కాని, నేడు ? నువ్వు సుఖపడుతున్నావు. అదే యిప్పుడైతే నానదవడి మరోవిధంగా వుండేది. ఆరోజులే వస్తేనా? ఒంటరిజీవితం దుర్భరం, మేరియా! ఇంతకాలానికి ఈఒక్కనాడే కాస్త ఆనందంగా వుంది."

"నాద్యా చాలా తెలివైనది. ప్రపంచం ఎరిగినదీనూ. మరొకళ్ళయితే నిన్ను చూడడానికి ఒప్పుకొని వుండరు."

సరిగ్గా అయిదుగంటలవేళ శుభ్రమైన దుస్తుల్లో, వెండిగడియారం జేబులో వేసుకుని ఆతురతతో వచ్చి ఉసోవు కూతురు యింటితలుపు తట్టాడు. మేరియా తలుపు తెరిచింది.

'రా. లోపలికి.'

ఉసోవు కంగారుగా సావిడిలో ప్రవేశించి నిలబడి పోయాడు. క్షమార్పణ, సానుభూతి అర్థిస్తూన్నట్లు మేరియా యెదుట తల వొరగ వేసికుని వంగి నిలబడిపోయాడు. మేరియా ఆతనికి వ్రేలితో ఒకద్వారం వేపు చూపి, తాను ఇంట్లోకి వెళ్ళిపోయింది.

ఆయిల్లు మంచిగాలి, వెలుతురుతో అందంగా, ప్రశాంతంగా వుంది. ఉసోవు తలుపు తెరుచుకుని జంకుతూ, కొంకుతూ గదిలో ప్రవేశించాడు. ద్వారంవేపు వెన్నుతిప్పి ఒక పొడుగాటి స్త్రీ కిటికీవద్ద నిలబడి వుంది.

"నాలాగే పొడుగు" అనుకొని ఉసోవు సంతోషపడ్డాడు. ధైర్యం కలిగింది. తెరచిన ద్వారం వెంట సన్ననిగాలి లోన ప్రవేశించి ఆమె ముంగురుల్ని కదలించింది.

నాడియా వెనక తిరిగి, సాధారణ గమనంతో ఆతని దగ్గరకు

వచ్చి నిలబడింది. ఉసోవు తల వూపుతూ, ఆమె చేయి తనచేతితో పట్టుకున్నాడు. నాద్యా ఆతనిని ఒక కుర్చీలో కూర్చోమని, తాను సోఫాలో కూర్చుంది. ఆమె కిచ్చిన పతకాలకోసం ఉసోవు చూసాడు. కనబడలేదు. "బహుశా, పెట్టుకోదు కాబోలు"——అనుకున్నాడు.

నుదుటి చెమటలు జేబురుమాలుతో వొత్తుకుంటూ, ఉసోవు——'ఈవేళ చాలా వుక్కగా'——అన్నాడు.

'ఉక్కగానే వుంది'

ముసలివాడు కూతురు మొగం వంక చూసాడు. నల్లని, పొడుగయిన కనుబొమ్మలు ముఖానికి గంభీరతను కలిగిస్తున్నాయి. మొగం, చేతులు, కంఠం, ఎండవేడికి నల్లబడ్డాయి.

"మిల్లులో ఇప్పుడు బాగా ఉక్కిరిబిక్కిరి అయ్యేలా వుంటుందనుకుంటా."

"లేదు. లేదు. గాలి ధారాళంగా రావడానికి తగిన ఏర్పాట్లుచేశారు."

"గాలి, వెల్తురు బాగావుంటే చాల వుపయోగం వుంది. ఎంత వున్నా మిల్లులో వేసవికాలం వుక్కగానే వుంటుంది. ఔనుగాని, అన్ని మగ్గాలమీద ఒక్కర్తెవు పని ఏవిధంగా చేయగలుగుతావు?" ఆశ్చర్యంతో చేతులు జాపి మళ్ళీ కుర్చీమీదికి జారవిడుస్తాడు. "రెండువందల ఎనిమిది మగ్గాలు ! అమ్మబాబో!"

"ఆటోమాటిక్ కంట్రోల్సుతో మీరు ఎప్పుడేనా పనిచేశారా?"

"పనిచెయ్యలేదు గాని, వాటిని చూశాను."

నాద్యా. అవి ఏలాపనిచేస్తాయో విపులంగా, చేతులూ, వ్రేళ్ళూ కదుపుతూ, స్పష్టంగా అర్థం అయ్యేలా చెప్పింది

ఎలక్ట్రిసిటీ సాయంతో వేడి ఎక్కే కెటిల్‌తో తయారుచేసిన టీ, రొట్టెలు, తీపిసరుకు అమర్చిన ప్లేట్లు; గ్లాసులు తెచ్చి మేరియా వారి ఎదుటనున్న బల్లమీద పెట్టి వెళ్ళిపోయింది. నాద్యా గ్లాసులలో టీ పోసింది.

ఉసోవ్ తన అనుభవాలన్నీ చెప్పసాగాడు. తనుమాత్రం ఏం సాధారణుడా ? తన కాలంలో తానూ ఘట్టిహడే. ఎంతపనివాడై తేనేం ?- ఆరోజులు ఆలాంటివి. నాద్యా శ్రద్ధగా అతడు చెప్పినవి వింది. ఆమె శ్రద్ధచూస్తే ఆతనికీ హుషారు హెచ్చింది. మిల్లులమీద వ్యక్తుల అధికారం వున్న తనకాలంనాడు మిల్లులలో అలవాట్లు, పద్ధతులు వరసన చెప్పుకువచ్చాడు.

మాటల హడావిడిలో ఉసోవు చేయితగిలి టీకప్పు తొణికి బట్ట మీద కొద్దిగా చిలికింది. సిగ్గుపడతాడేమోననే ఆలోచనతో నాద్యా ఆవిషయం చూడనట్టుగానే తన సంభాషణ సాగించింది.

"ఏలావుంటున్నారు, మీరు ?"

ఉసోవు ఒక వేలెత్తి చూపాడు.

"ఒంటరితనంగా, ఒక్కడిసీ"

"అది నేనూ ఎరుగుదును. ఆర్థికంగా మాట."

ముసలివాడు ఆమె వంక ఆశ్చర్యంతో చూసాడు.

"బహుశా చిక్కుపడుతూండి వుంటారు. పెన్షన్ సరిపడుతూండి వుండదు."

ఆమె గొంతు బహుమృదువుగా ఆతని విషయమై ఆతురతను సూచిస్తూంది. ఆతని కళ్ళలోనికి గుచ్చి చూస్తూ సమాధానం కోసం ఎదురు చూస్తూంది.

"నాజీవితంలో వాళ్ళకి ఒక్కకానీ కూడా ఇవ్వలేక పోయాను." అని ముసలివాడు తన్ను తానే మనసులో నిందించుకొని, సిగ్గుతో తల వంచుకున్నాడు.

"సందేహించకండి....మాకుశక్తి...."

"వద్దమ్మా!" అన్నాడు బ్రతిమాలుతూన్నట్లుగా ముసిలివాడు. "నాకు వచ్చేది నాకు చాలు....ఇంకేమీ వద్దు."

"ఏం? అందులో తప్పేమీ........"

"అందుకోసం రాలేదమ్మా నేను."

ఒక చిన్నబిడ్డ గదిలోకి పరుగెత్తుకొని వచ్చి తల్లివంక తొంగి చూచింది.

"అమ్మమ్మా, నేనూ పార్కుకి వెడతాం."

ఉసోవు బిడ్డవంక సాదరంగా చూసాడు.

"నాద్యాకూడా ఇంత చురుగానూ వుండీది హాబోలు" అనుకున్నాడు, ఆతడు. "మనమరాలిని తీసుకుని నేను ఈనాడు షికార్లు కొడుతూ వుండేవాడిని కదా? ఎంత అదృష్టం తొలగదోసుకున్నాను. ఆ అదృష్టం ఇంకలేదు. రాదు."

నాద్యా కూతురు తలమీది టోపీ సరిచేసి ఆలేతబుగ్గలు ముద్దుగా నిమిరింది.

"వెళ్ళు తల్లీ."

ఉసోవు ఎత్తలేక ఎత్తలేక తలయెత్తాడు.

"నాద్జ్యాదా ఇవానోవ్నా!" *

"కాదు పెట్రోవ్నా!" అని నాద్జ్యాదా ఆతని తప్పు దిద్దింది. ఉసోవు ఆదిద్దుబాటును ఉచ్చరించలేకపోయాడు.

"నాద్యా! విల్లులో నాయిల్లు నీకు వ్రాయాలని అనుకుంటున్నా"

ఒక్క క్షణం కాలం ఆమెకళ్ళలో విసుగుపాటు గోచరించింది. కాని, అంతలో సంబాళించుకుని. చిరునవ్వు నవ్వింది.

"ఏమిటి చెయ్యం దాన్ని?"

ఉసోవ్ మాట్లాడలేదు.

"మాకు శుభ్రమైన యిల్లు వుందాయె. మిల్లుకు బహుదగ్గర...."

ఉసోవు తలమీది టోపీ సర్దుకుని లేచి నిలబడ్డాడు.

* రష్యనులు పిలిచేటప్పుడు తండ్రిపేరుకూడాకలుపుతారు. ఇవాన్‌కూతురు ఇవానోవ్నా

నాద్యా అభిమానం, ఆదరం. తొణికే చూపులు చూసింది.

"మరోకలాగ అనుకోవద్దు....ఆలోచించి చూడండి. నాకు ఇల్లు ఎందుకు? రాబోయే ఆకురాలు కాలంలో చదువుకుందుకు వెళ్ళిపోతున్నా. అమ్మకేనా అది ఎందుకు? ఇది చాలదూ?"

ఉసోవు ఆతురతతో "చదువుకుందుకా? ఎక్కడికి?" అన్నాడు.

"కాలేజీకి"

"ఏ కాలేజీ?"

"ఇంజనీరింగ్ కాలేజీకి."

"నిజంగా? బాగుంది....చక్కగా వుంది....ఇంక మరోలా అనుకోవడమా....నాకు అటువంటి అదృష్టం..." జీవితాంతం వరకు తన మనస్సుని పీడించుకుతినే భావాలను చెప్పేసేవాడే. కాని మాట పెగిలి రాలేదు తల తిప్పుకొని, నిట్టూర్పు విడిచాడు. చిన్నప్పుడు తండ్రికోసం ఎప్పుడేనా తలుచుకున్నావా? అని అడుగుదామనుకున్నాడు. కాని ధైర్యం చాలిందికాదు. బహుశా ఆమె ఎప్పుడూ తలుచుకోనే లేదేమో. ఆతని విషయంలో ఆమెకు అభిమానం కాక దయమాత్రమేనేమోపుంట.

వెచ్చనిగాలి గదిలోకి వచ్చి బల్లమీద పడివున్న నోటుబుక్కుల కాగితాలు తిరగబడ్డాయి. ఉసోవు ఆతురతతో అక్కడికిపోయి చూసాడు.

"మనమరాలివేనా?.... నీకూతురివా?" అంటూ ఆతడు కలగ దొక్కుకుని, తడబడ్డాడు.

"కాదు. అంతటి వయస్సేదీ? నావే."

అంతలో టెలిఫోను మ్రోగింది. నాద్యా రిసీవరు తీసుకుంది.

"ఒక్క అరగంటా?-అంతకి ఎక్కువ తీసుకోదుగద- నాకు పనిలోకి పోయే వేళ అయింది-" ఆమె చేతి గడియారం చూసుకుంది. "అక్కడికి వెళ్ళేందుకే పడుతుందేమో....కారు పంపుతావా?....మరీ మంచిది....త్వరగా పంపు."

నాద్యా రిసీవరుక్రింద పెట్టేసింది. ఆమెను ఆట్టేసేపు నిలప కూడదని ఉసోవు టోపీ తీసాడు.

"ఈవేళ రాత్రి షిఫ్టా ?"

"ఔను. రాత్రంతా పనివుంటుంది."

ఇద్దరూ ఒక్కక్షణం నిశ్శబ్దంగా నిలబడ్డారు. ముసిలివాడు తల పంకిస్తూ ఒక ఫొటోవంక చూసాడు.

"నీగుర్తుగా ఆఫోటో ఇస్తావా ? చచ్చిపోయే ముందు చూసు కుంటాను."

"ఆమాట యెందుకు? చావు సంగతా మనం ఆలోచించవలసింది? జీవితం మాటగాని."

నాద్యా ఫొటో గోడనుంచి తీసింది. దానిమీద ఏదో వ్రాసింది. ఆతనికి అందించింది. ఆతడు బహు భద్రంగా తీసుకున్నాడు.

"నువ్వు మంచిదానివమ్మా! ఇంక పోతా. నూరేళ్ళు సుఖంగా బ్రతుకు, తల్లీ!...."

బయట మోటారు హారన్ వినబడింది.

"కారులో ఇంటివద్ద దిగబెడతా."

భర్తను చూడడానికి ఒక్క నిముషం వీధిలోకి వెళ్ళింది. మళ్ళీ వచ్చి చిలుక్కొయ్యనున్న కోటు చేతిమీద వేసుకుని గుమ్మంవేపు నడిచింది.

ఉసోవు ఆమె వెంట నడిచాడు. "అల్లుడినికూడా చూస్తే బాగుం డును." అనుకున్నాడు.

మెట్లు దిగుతూండగా ఉసోవు మళ్ళీ "నువ్వు చదువుకుందుకు వెడతావా ?" అన్నాడు. "తప్పకుండా చదువు. సాధించు. అయితే, నీభర్త మాటేమిటి ? ఒప్పుకుంటాడా ?"

"ఆసమస్యలేదు," అంది, నాద్యా దృఢస్వరంతో, మృదువుగా. "పైగా ఆయనా చదువుతున్నారు."

ఇద్దరూ వీధిలోకి వెళ్ళారు. నాద్యా మల్లెపువ్వులా సున్నితంగా కారులో కూర్చుంది. ఉసోవు కంగారు పడుతూ సీటులో చదికిలబడ్డాడు. నాద్యా కుషన్లకి జేరబడి కూర్చుని చిరునవ్వు నవ్వింది. కారు బర్రున ముందుకు సాగింది.

"నాజీవితంలో ఇదే కారు ఎక్కడం."

"నిజమేనా" అంది నాద్యా ఆశ్చర్యంతో.

ఒక పెద్ద మూడంతస్థుల భవనం ముందు కారు అర్థచంద్రా కారపుబాటకు తిరిగి గుమ్మంవద్ద నిలబడింది. నాద్యా చాఫర్‌తో ఏదో చెప్పింది.

"సాషా! వీరిని తీసికెళ్ళి దిగబెట్టు." ఉసోవువంక తిరిగి-"ఎక్కడికి వెళ్ళాలి? అతనికి చెప్పండి." అంటూ ఆమె చిరునవ్వు నవ్వి, కారు తలుపు మూసింది.

కారు బహువేగంగా జనసమర్దంగావున్న వీధులు దాటి, తోటలూ వొడ్లూ, మధ్యవున్న పేటలు దాటింది. హఠాత్తుగా ఉసోవుకు గుర్తు వచ్చింది.

"దాటి వచ్చేశాం, వెనక్కి వెళ్ళాలి. ఎదుట పూలతోట వుందే, అపచ్చమేడ." అని వ్రేలితో చూపాడు.

డ్రైవరు కారు తిప్పాడు. ఉసోవు కారులోంచి దిగుతూ తూలి పోయాడు. కళ్ళు తిరిగినట్లయింది. నెమ్మదిగా కాళ్ళు ఈడ్చుకుంటూ పూలతోట గేటుదాకా నడిచి తిన్నెమీద చతికిల బడ్డాడు. బహు ఆయాస పడిపోయాడు.

అంతా అయిపోయిందా? తనకంత ఆనందం కలిగించిన

ఆయింటికి తానింక వెళ్ళలేదూ ? ఎంత అదృష్టం చేయి జారవిడుచుకున్నాడు !

ఉసోవు నెమ్మదిగా ఆఫొటోగ్రాపు జేబులోంచి పైకి తీసాడు. కూతురు మొగంవంక చాలసేపు పరకాయించి చూసాడు. హఠాత్తుగా బొమ్మవెనక నాద్యా ఏమో వ్రాసిందని జ్ఞప్తికి వచ్చింది. తిరగేసిచూసాడు.

"నాన్నగారికి—నాద్‌జ్యాదా."

"నాద్‌జ్యాదా" : అంటే "ఆశ."

ఉసోవు ఆ అక్షరాలు ముద్దుపెట్టుకున్నాడు. ఆతని కళ్ళు చెమ్మగిల్లినాయి.

(రచన—1938)

---

# అజ్ఞాత ప్రేమ

## పాల్ హేసీ

అప్పుడే తెల్లవారింది. వెసూవియస్ పర్వతంమీద ఆవరించివున్న మంచుతెర నేపుల్స్‌దాకా విస్తరించి సముద్రతీర నగరాలన్నిటినీ కప్పేసింది. సముద్రం ప్రశాంతంగా వుంది. సారెంటో పర్వతసానువులక్రింద సముద్రతీరాన పల్లెవాళ్ళు చాలా హడావుడిగా వున్నారు. రాత్రివేసిన వలల్ని సముద్రంలోంచి పడవల సహాయంతో కొంతమంది లాక్కొస్తున్నారు. మిగతావాళ్ళు తెరచాపలు, తాళ్ళు, పడవకొయ్యలు బాగుచేసుకోడంలో నిమగ్నులై వున్నారు.

కాప్రీదీవిలో వున్న వృద్ధ ధనికురాల్ని చూడడానికి మతగురువు వెడుతున్నాడు. రేవులోకి వచ్చి, తనెక్కబోయే పడవలోని ఆంటోనియోని చూసి, "మనం పోడానికి గాలి బాగుంటుందా? నాయనా!" అన్నాడు. "ఇంకా పొద్దుపైకి రాలేదు. అప్పటికి యీమంచు పోతుంది" అన్నాడు ఆంటోనియో.

"అయితే త్వరగా పోనీ."

ఆంటోనియో తెడ్డు వెయ్యబోతూ, సమయానికి, కొండమీంచి దిగివస్తూన్న సన్నటి పొడుగాటి పిల్లని చూసి ఆగేడు. ఆపిల్ల పడవ ఆపమని చేరుమా లూపుతోంది ఆమె గుడ్డలు బీదరికాన్ని సూచిస్తున్నాయి. చేతిక్రింద ఒక చిన్న మూటకూడా వుంది. ఆమె నడకతీరులో మార్దవం కనపడదు.

"ఏం ఆగేవెందుకు?" అన్నాడు మతగురువు.

"ఎవరో వస్తున్నారు. బాబూ! ఏం ఆలస్యం చెయ్యను. చిన్నపిల్లే లేండి. ఒక్కత్తే వస్తూంది.

ఆసమయానికే ఆపిల్ల దగ్గరలో కొచ్చింది.

"లారెలా" అన్నాడు గురువు. "ఆమెకి కాప్రీలో ఏం పనుంది?"

ఆంటోనియో ఏం మాట్లాడలేదు.

ఒకరిద్దరు పడవవాళ్ళు ఆమెని పలకరించేరు.

"లారెలా! బాగున్నావా? మాతో కాప్రీకి వస్తున్నావా!"

"రాడానికి వీలుంటే, ఫాదర్" అంది.

"ఆంటోనియోని అడుగు. అతడే దీని కధికారి. భగవంతుఁడు మాత్రం మనందరికీని."

లారెలా పడవవానికేసి చూడకుండానే "నాదగ్గిర పావలాయే వుంది. తీసికెడతావా ?" అంది.

"నాకంటె ఆపావలా నీకే అవుసరం యెక్కువ" అని సణిగాడు, ఆంటోనియో, నారింజకాయ బుట్టలు సద్దుతూ. గుట్టలమయమైన, కాప్రీ దీవిలోకి ఈకాయలు ప్రతిరోజూ రవాణా అవుతుంటాయి.

"వూరికే అయితే నేను రాడాని కిష్టపడను" అంది, నల్లటి కను బొమ్మలు పైకెత్తుతూ, లారెలా.

"రా, అమ్మా, రా, చాలా మంచివాడితను. నీడబ్బుచ్చుకోకపోతే యితనికి గడవకపోదు. రా లోపలికి" అంటూ చేయూత నిచ్చేడు ఆమెకి గురువు.

"చూడు, నువ్వు కూచోడానికి కోటుకూడా పరిచేడు. పడుచు వాళ్ళంతా అంతే. పద్దెనిమిదేళ్ళ పడుచుకి చేసే సేవ, పదిమంది మాలాటి వాళ్ళకూ్కడా చేయరు. భగవంతుడుకూడా యిదే అన్నాడు. సమాన వయస్కులు కలిసి కట్టుగా వుంటారని."

లారెలా లోపలికివచ్చి. ఆంటోనియో పరిచిన కోటు తీసేసి మరీ కూచుంది, గురువు ప్రక్కన. ఆంటోనియో అది చూసే వూరుకున్నాడు. పడవ ఒక్క వూపుతో ఒడ్డునుంచి దూసుకు పోయింది.

"ఆమూటలో దేమిటమ్మా!" అన్నాడు గురువు. ప్రశాంతమైన

సముద్రంలో లేతఎండలు మెరుస్తూంటే, పడవ సాగిపోతూంది.

"పట్టు, దారం, రొట్టె, పట్టు. రాత్రీలో రిబ్బన్లుచేసే ఆమెకమ్మాలి, దారం ఇంకొకరికి" అంది.

"నువ్వు వడికిందేనా?"

"అవును."

"ఇదివరకు రిబ్బన్లు నువ్వే అల్లేదానివేమో—అల్లా జ్ఞాపకంనాకు."

"ఇదివరకు అల్లేదాన్ని బాబూ, కాని యిపుడు అమ్మకి జబ్బుగా వుంది. నేనాట్టేసేపు దూరంగా వుండలేను. స్వంతమగ్గం వుండేంత భాగ్యవంతులం కాదుకదా మరి."

"అమ్మకి జబ్బు ఎక్కువైందా! ఆమెకు. పాపం. నేను ఇదివరకు చూసినపుడు బాగానే వుంది?"

"ఈఋతువులో ఆమెకి జబ్బు ఎక్కువవుతూనే వుంటుంది. మంచం దిగటం లేదు."

"ప్రార్థిస్తూ వుండమ్మా, ఎపుడూ దేవుని ప్రార్థిస్తూ వుండు ఆతను నీప్రార్థనలు వింటాడు. నీపని శ్రద్ధగా చేసికొంటూ మంచిగా వుండు." అన్నాడు.

కాసేపుండి "నువ్వెందాకా, పడవకేసి వస్తూంటే ఒడ్డుమీదివాళ్లు. నమస్కారం! కాళీశక్తీ! అన్నారేం? నీలాంటి మంచిపిల్లకా పేరు బాగుండలేదు," అన్నాడు.

ఆపిల్ల మొహం ఎఱ్ఱబడింది. కళ్ళు నిప్పులు కురిసేయి.

"ఏం లేదు. మిగతా పిల్లల్లాగ, వాళ్ళతో ఆడుతూ పాడుతూ వుండనని, అల్లాగ వేళాకోళం చేస్తూంటారు. నాఅంతట నన్నుండ నివ్వరు. వాళ్ళకి నేనేం అపకారం చేసేను?"

"కాని నువ్వు కలసిమెలసి వుండొచ్చు, తీరిగ్గా వున్నవాళ్ళని

ఆడనీ పాడనీ. ఎంత బాధపడుతూన్నవాళ్ళనింపైనా ఒక మృదువైన మాట ప్రతివాళ్ళూ ఆశిస్తారు." అన్నాడు గురువు.

ఆమె నల్లటి కళ్ళు కిందికి వాల్చింది. ఆకళ్ళనింకా మూసెయ్యడానికా అన్నట్లు నల్లటి కనుబొమల్ని చిట్లించింది.

కాసేపు నిశ్శబ్దంగా వున్నారు. సూర్యుడు కొండల్లోంచి పైకి వచ్చేడు. వెసూవియస్ పర్వతశిఖరం పైన మాత్రం కొద్దిగా పొగ మంచుంది. సొరెంటోమీద, నల్లటి నారింజతోటల్లో యిళ్ళు తెల్లగా కనిపిస్తున్నాయి.

"లారెలా! నేపుల్సునుంచి వచ్చిన చిత్రకారుణ్ని గురించి మళ్ళీ ఏమేనా విన్నావా? ఆతను నిన్ను పెళ్ళిచేసుకుందా మనుకున్నాడుకదూ?" అన్నాడు గురువు. "అతడు నీబొమ్మ గీద్దామనుకున్నాడు వేయనిచ్చేవు కాదేం!"

"ఎందుకు వెయ్యాలి? నాకంటె అందమైన పిల్లలున్నారు. ఏమో, దాంతో ఏంచేస్తాడో ఎవరికి తెలుసు? దాంతో మాయచేసి నన్ను చంపేసునని అమ్మ చెప్పింది." అంది లారెలా.

"ఆపెర్రి కబుర్లెప్పుడూ నమ్మకు" అన్నాడు గురువు. "దేవుడు నిన్నెప్పుడూ రక్షించడం లేదూ? ఒక చిన్నబొమ్మతో, వాడు నిన్ను, దేవుణ్ణి ధిక్కరించి బాధపెట్టగలడా! కాకపోయినా, వాడు నువ్వంటే చాలా ప్రేమగా వున్నాడని నీకు తెలిసే వుంటుంది."

ఆపిల్ల యేమీ మాట్లాడలేదు.

"వాణ్ణెందుకు తిరస్కరించేవు? మంచి మర్యాదస్తుడు. నెమ్మదైనవాడు. నిన్నూ, తల్లినీకూడా బాగా పోషించి వుండేవాడు" అన్నాడు మళ్ళీ.

"మేము చాలా బీదవాళ్ళం. అమ్మకి రోగం. మేమాయనకి చాలా బాధ కల్గించేవాళ్ళం. ఆ మర్యాదస్థుడికి నేను తగను. స్నేహితులాయన్ని మాడ్డాని కొచ్చినపుడు నన్ను గురించి ఆయన సిగ్గుపడి వుండేవాడు."

"అల్లా అవుతుందని నీకేం తెల్సు. అతను చాలా మంచివాడు, దయకలవాడు. అత డిక్కడే స్థిరపడి పోనేమో కూడాను. అల్లాంటి మొగుడు నీకు మళ్ళీ దొరకడం చాలా కష్టం" అన్నాడు గురువు.

"నాకసలు పెళ్ళే వద్దు" అంది సగం వినపడీ వినపడనట్టుగా.

"అది ప్రతిజ్ఞా? సన్యాసం పుచ్చుకుంటా వేమిటి?"

ఆమె తల వూపింది.

"వాళ్లు నీకు పెట్టిన పేరులో దయలేకపోయినా, నిజం లేక పోలేదు. ఈప్రపంచంలో నువ్వు ఒంటరిదానివనీ, నీతలతిక్క మీఅమ్మకి ఇంకా కష్టాలు కలిగిస్తుందనీ తెలుసుకున్నావా! పోనీ. నువ్వసలు పెళ్ళాడక పోడానికి కారణం చెప్తావా!" అన్నాడు.

"కారణం వుందికాని, నేను చెప్పలేను" అంది అయిష్టంగానూ, మెల్లిగానూ.

"చెప్పలేవూ? నాకు? నేను నీశుభం కోరీవాడి నవునా? కాదా?" అన్నాడు.

లారెలా తల వూపింది.

"అయితే చెప్పమ్మా. నీహృదయభారం కొంత తగ్గుతుంది. నీకారణం సరైందైతే. నేనుకూడా నిన్ను బలపరుస్తాను నీకింకా చిన్న తనం. ప్రపంచ అనుభవం తక్కువ. ఒకప్పుడు మాత్రం యీపెంకి తనానికి నువ్వు దుఃఖిస్తావు."

సిగ్గుపడుతూ ఆపిల్ల పడవచివరకి చూసింది. అక్కడ ఆంటానియో తెడ్లు వేగంగా వేస్తున్నాడు. వున్నిటోపీ కళ్ళమీదికంటా లాక్కున్నాడు. ఏవో ఆలోచనల్లో మునిగివున్నట్లు, అతడు దూరంగా నీళ్ళల్లోకి చూస్తున్నాడు.

గురువు ఆమె చూపులు చూసి వినడానికి తల యింకా వొంచేసు.

"మానాన్న నెఱుగుదురా?" అని రహస్యంలా మెల్లిగా అడిగింది లారెలా, విచారదృక్కులు కళ్ళల్లో అలుము కుంటుంటే.

"మీనాన్నా? ఎరక్కేం! అతడు పోయేప్పటికి నీకు పదేళ్ళు. ఆయనకీ,—అతని ఆత్మకు శాంతి కల్గుగాక!—నీపెంకితనంకీ సంబంధం ఏమిటి?"

"ఆయన్ని మీరు సరిగా ఎరగరు. మాఅమ్మ జబ్బుకి ఆయనే కారణం."

"అదెల్లాగ?"

"మానాన్న, అమ్మను బాదబాదేవాడు. అతడు కోపంగా వచ్చిన రాత్రులు నాకిప్పటికీ జ్ఞాపకమే. నాన్న చెప్పిన పనులన్నీ చేసేది అమ్మ. ఏం మాట్లాడేది కాదు. అయినా సరే అమ్మని చావబాదేవాడు. నాకు భయంవేసి కళ్ళు మూసుకుని ఏడుస్తూనే వుండేదాన్ని, రాత్రంతా. చావు దెబ్బలుతిని, అమ్మ కింద పడివున్నపుడు చూసేక, నాన్న వెంటనే మారి పోయీవాడు. వెంటనే ఆమె నెత్తుకుని, నలిపేసేవని గోలెట్టీదాకా, ముద్దెట్టుకునీవాడు. ఈసంగతెక్కడా చెప్పొద్దని అమ్మ నన్ను శాసించింది. అదే ఆమె ఆరోగ్యాన్ని పాడుచేసింది. నాన్న పోయాకకూడా ఆమె కోలుకోలేదు."

గురువుగారు కాస్సేపు ఆలోచించాడు. చివరికిల్లా అన్నాడు. "మీఅమ్మలాగే నువ్వుకూడా మీనాన్నని క్షమించి అటువంటి విషయాల మీదికి నీఆలోచన్లు పోనీయకు. లారెలా! నీకు, గతాన్ని మరపింపచేసే మంచి రోజులు రావచ్చు.

"నేను మాత్రం మరచిపోలేను" అంది వణకుతూ. "అదే నేను పెళ్ళాడక పోడానికి కారణం. నన్ను చావకొట్టి, తరవాత లాలించే మగాడు నాకక్కరలేదు. ఇప్పు డెవరేనా నన్ను కొట్టాలన్నా, ముద్దెట్టు కోవాలన్నా నన్ను నేను రక్షించుకోగలను. కాని అమ్మమాత్రం, నాన్నను

ప్రేమించింది కనుక. దెబ్బలనించి కాచుకోలేక పోయింది. నాజీవితం దుఃఖమయం చేసుకొనేలా నేనెవర్నీ ప్రేమించను."

"నువ్వింకా చిన్నపిల్లవు. జీవితం గురించి నీకింకా అనుభవం లేదు. భర్తలంతా మీనాన్నలాగే వున్నారా? మంచి భర్తలనీ, మంచిభార్య లనీ, సుఖంగా కాపురం చేస్తున్నవాళ్ళని నువ్వు చూడలేదూ?"

"కాని నాన్న సంగతేవేరు. అమ్మ చావడానికేనా సిద్ధంగాని, నాన్నని గురించి పల్లెత్తుమాట అనేదికాదు. అదంతా ఆమె ప్రేమించింది కనకనే. అదే ప్రేమ అయితే—బాధతో సహాయం కోసం అరవడానికి బదులు, పెదిమల్ని మూయించేది ప్రేమయితే—అదే మనల్ని ఎదుర్కోకుండా బాధ ననుభవించేలా చేసేదయితే—నేను మానవమాత్రుణ్ణి ఎప్పుడూ ప్రేమించను."

"నీకింకా చిన్నతనం. నువ్వేం చెప్తున్నావో నీకే తెలియదు. ప్రేమ నీకు చెప్పిరాదు." కాస్సేపు ఆగి మళ్ళీఅన్నాడు. "ఆచిత్రకారుడు, అతడుకూడా క్రూరంగా వుండగలడంటావా?"

"అతడి కళ్ళభంగిమ, సరిగా మానాన్న అమ్మని లాలించడానికి బ్రతిమలాడినట్లే వుంది. ఆచూపు నాకు తెలుసు. అటువంటి చూపుంకీ కూడా తనని బాధపెట్టని భార్యను కొట్టడానికి జంకడని నాఅభిప్రాయం. ఆతని చూపు చూస్తే నాఒళ్ళు జర్జరిత మయేది."

ఆతరువాత అంతా నిశ్శబ్దం. అతడు కొంచెం సలహా యిద్దామనుకున్నాడు కాని, తమ సంభాషణాంత్యసమయంలో చికాకుగావున్న ఆంటోనియోవి చూసి ఆగి పోయేడు.

రెండుగంటల నావ ప్రయాణం తర్వాత, కాప్రీ చేరేరు. ఆంటోనియో గురువుని చేతుల్లో ఎత్తుకుని పొడినేలని దింపేడు. అతడు తిరిగి రాకమునుపే, లారెలా బట్ట పైకి పట్టుకుని, మూటా, జోళ్ళూ ఇంకో చేతిలో పట్టుకుని, రెండడుగుల్లో ఒడ్డుకి పోయింది.

"నేను సాయంకాలం మళ్ళీ యింటికి పోవాలి. ఆలోపుగా నువ్వొస్తే నాకభ్యంతరం లేదు. నువ్వు రాకపోయినా, నాకొకటే" అన్నాడు అంటోనియో.

"నువ్వు తప్పకుండా వెళ్ళమ్మా, అమ్మ కనిపెట్టుకుని వుంటుంది. సరే నేపోతాను. మీయిద్దరికీ ఆశీర్వాదాలు" అని వెళ్ళిపోయేడు గురువు.

లారెలాకూడా తనదారిని బయల్దేరింది. అంటోనియో టోపీతీసి పడవలో పడేసి ఆమెనే చూడ్డం మొదలెట్టేడు. మొదటినుంచీ ఆమె అంటే నిర్లక్ష్యంగా వున్నట్టు కనపడ్డా, యిప్పటి అతని వైఖరిమాత్రం దానికి పూర్తిగా వ్యతిరేకంగా వుంది. ఆమెకూడా కొండమీదికి కొంత దాకా యెక్కి ఒకసారి వెనక్కి తిరిగి చూసింది. కిందగా బీచివుంది. చుట్టూ పెద్దపెద్ద రాళ్ళు పడివున్నాయి. సముద్రం స్వచ్ఛమైన నీలపు కాంతితో ప్రకాశిస్తూంది. చూడతగ్గదృశ్యం మాత్ర మవును. ఆచూడ్డంలో ఒక్కక్షణం ఆమె చూపులూ, అంటోనియో చూపులూ కలసికొన్నాయి. ఇద్దరూ కూడా కదిలేరు. విషాదచ్ఛాయలతో లారెలా కదలి పోయింది.

అంటోనియో పడవవాళ్ళ హోటలుముందు బెంచిమీద కూచుని మాటిమాటికీ ఆతృతగా రోడ్డుకేసి చూస్తున్నాడు. మధ్యాహ్నం రెండు గంటలు అవుతూందేమో అంతే. అంటోనియో వైన్ తాగుతూ స్నేహితునితో మాట్లాడుతున్నాడు. మనస్సు మాత్రం అక్కడలేదు. ఇంతలో దూరాన లారెలాని చూసేడు. వెంటనే స్నేహితుని దగ్గిర సెలవుతీసికుని, త్వరత్వరగా పడవకేసి పరుగెత్తేడు. పడవని సిద్ధంచేసి నుంచున్నాడు లారెలా బీచిఒడ్డుకి వచ్చి, చుట్టూ కలయచూసింది ఇంకా ఎవరేనా ప్రయాణీకులున్నారేమోనని. అంతా నిశ్శబ్దంగా వుంది. పడవవాళ్ళు నిద్రపోతున్నారు. ఆడాళ్ళు నూలు వడుకుతున్నారు. లారెలా వద్దని ఆపే లోపుగానే, అంటోనియో ఆమెని చేతుల్లో తీసికొని పడవలో దించి తాను కూడా ఎక్కి పడవ తోసేసేడు.

లారెలా, వెన్ను సగం ఆంటోనియోకేసి తిప్పి కూర్చుంది. పెద వులు మూసేసింది. ఇదివరకట్కంటే గంభీరంగా కూచుంది. కాస్తసారం వెళ్లేక, ఎండ చాలా ఎక్కువగా వుండడం చేత, మూటవిప్పి జేబు రుమాలు నెత్తిమీద వేసుకొని రొట్టె తినే సరంజామాలో వుంది.

ఆంటోనియో కా పద్ధతేమీ నచ్చలేదు. రెండు నారింజపళ్లామె కిస్తూ "లారెలా యివి తీసుకో; నీకోసం యివి దాచేననుకోకు, ప్రొద్దుట బుట్టలఅడుగున వుండిపోయేయి" అన్నాడు.

"నాకీ రొట్టె చాలు. అవి నువ్వే తిను."

"చాలాదూరం నడిచి వొచ్చేవు. ఈయెండలో యివి చల్లదనం యిస్తాయి."

"వాళ్ళు మంచినీళ్ళిచ్చేరు. అదే చాలు నాకీయెండలో."

"నీయిష్టం" అంటూ వాటిని మళ్ళీ బుట్టలో పడేసేడు.

కొంతసేపు నిశ్శబ్దం. సముద్రం చాలా ప్రశాంతంగా వుంది.

"పోనీ అవి మీఅమ్మకి తీసికెళ్ళి యియ్యి" అన్నాడు ఆంటోనియో.

"నారింజలు మాయింటిదగ్గ రున్నాయి. అవి అయిపోతే నేను మళ్ళీ కొనగలను."

"కాదు కాదు. ఇవి తీసికెళ్ళి నాఅభివందనాలతో ఆవిడ కియ్యి."

"ఆవిడ నిన్నెరగదు."

"నేనెవరో నువ్వు చెప్పు ఆమెకు."

"నేనూ నిన్ను యెరగను."

ఇదివరకు ఆచిత్రకారు డీమెను నడిబజారులో చూసేడు. ఆంటో నియో, అతని స్నేహితులూ అక్కడే ఏదో ఆట ఆడుతున్నారు. చిత్ర కారు డామెని చూస్తూ నిర్ఘాంతపోయి వాళ్ళ ఆట కడ్డంగా నుంచున్నాడు. ఆంటోనియో అతన్ని గోళీకాయతో కొట్టి కదిపే డక్కడినుంచి. లారెలా ఆచిత్రకారుణ్ణి పెండ్లాడ నిరాకరించినప్పుడు, ఆంటోనియోకోసమా నీవు

నన్ను తిరస్కరిస్తూంట అని అడిగితే, ఆతడెవరో నాకు తెలియదంది. కాని అప్పటినుంచీ ఆమెకు ఆతడు గుర్తే.

వాళ్ళిద్దరూ పడవలో వున్నారు. గర్భశత్రువుల్లాగ, ఇద్దరూకూడా ఆవేశంతో వున్నారు. ఆంటోనియో పెదిమలు, కోపంతో అదురుతూ న్నాయి. లారెలా. రుమాలు తీసేసి, జుట్టు సరిచేసికో నారంభించింది. పడవలో ఇంకెవరూ లేనట్టు.

పడవ, దీవిదాటి చాలాదూరం వచ్చేసింది. సొరెంటో ఇంకా దూరంగానే వుంది. చుట్టూ దగ్గరలో పడవలుకూడా యేమీ లేవు. ఆంటోనియో చుట్టూ ఎవరూ లేనట్టు నిశ్చయం చేసుకోడం కోసమేమో అన్నట్టు చుట్టూ కలయచూసేడు. అతని మొహం తెల్లబోయింది. తెడ్లు వొదిలేసేడు. లారెలా తిరిగి చూసింది. భయంతోకాదు. జాగ్రత్తకోసం.

"ఈసంగతింతతో తేలిపోవాలి. చాలాకాలమైం దిది మొదలెట్టి. నన్నెరగ నంటున్నావుకాదూ నువ్వు!" ఆంటోనియో కోపంతో వణికి పోతున్నాడు. "ఇంతవరకు ఏదో చెప్దామని నీకోసం వస్తూంటే, పక్క మొహం పెట్టుకు దాటుకు పోతున్నావుకదూ ?"

"నీతో ఏం చెప్పాలి నేను?" లారెలా చటుక్కన సమాధానం యిచ్చింది. "నువ్వు నావిషయాల్లో కలుగజేసుకోవాలని చూస్తున్నట్లు నాకు తెలుసు. కాని నాకు నీతో అవుసరంలేదు. నిన్ను కాదుకదా, నేను ఎవర్నీ పెళ్ళాడను"

"ఇంకెవర్నీ కూడానా! ఎప్పుడూ అల్లా చెప్పలేదేం. ఆచిత్ర కారుడు పోయాడు కనకనా? ముందుముందు తెలుస్తుందిలే, నీకు. వున్న వాళ్ళలో మంచివాడిని ఏరుకుంటావు. నాకు తెలుసు."

"ఎవరికి తెలుసు. భవిష్యత్తెవరు చూడగలరు. నామనస్సు మార్చుకున్నా దాంతో నీకేంపని."

"నాకేంపనా?" ఆంటోనియో గబాలున లేచి నుంచున్నాడు వూగులాడుతున్న పడవలో. "నన్నుకాదని, యింకెవడికేనా ప్రేమ చూపించేవంటే, వాణ్ణి చంపి తీరతాను. జ్ఞాపకం వుంచుకో!"

"నేను నీకెప్పుడేనా వాగ్దానం చేసేనా ? నామీద నీకేం అధికారం వుంది ?"

"నాఅధికారమా!" ఆంటోనియో అరిచేడు. "అది యెక్కడా రాసిలేదు. కాని, నేను పుణ్యాత్ముడినైతే స్వర్గాని కెంత హక్కుందో, నీమీదకూడా అల్లాగే హక్కుందని నాహృదయం చెప్తూంది."

"నీయిష్టం వచ్చినట్టు చేసుకో. నీబెదరింపులకేం భయపడ బోవటంలేదు. నాకిష్టమైందే నేచేస్తాను."

"నిన్నాట్టేసేపు అల్లా మాట్లాడనివ్వను." ఆంటోనియో ఆవేశంతో వొణికిపోతున్నాడు. "నీలాంటి పెంకిఘటం వల్ల నాజీవితం నాశన మవ నివ్వను. నాచేతుల్లో వున్నావిప్పుడు. నేచెప్పినట్లు చేయిస్తాను." అని గర్జించేడు.

"ధైర్యం వుంటే నన్ను చంపు."

లారెలా కళ్లు ధైర్యంగా ఎదిరించాయి. కాని స్వరం మాత్రం చిన్నదిగా వుంది.

"సగం పనులు నేను చెయ్యను" ఆమాటలు ఆంటోనియో గొంతుకు పట్టుకున్నాయి. "మనిద్దరికీకూడా సముద్రంలో చోటుంది పిల్లా"—ఆతని స్వరం కలలోలాగ వుంది. "మనిద్దరం కలిసే మునిగి పోవాలి! యిప్పుడే." అని అరుస్తూ ఆమెని చేతుల్లోకి లాక్కున్నాడు. ఆక్షణంలోనే కుడిచెయ్యి వెనక్కి లాక్కున్నాడు. లారెలా గట్టిగా కరిచింది.

"ఏం? నన్ను నువ్వు ఆజ్ఞాపించగలవా?" అంటూ బలంగా ఒక్క తోపు తోసింది. "నేను నీఅదుపులో వున్నానా?" సముద్రంలోకి వురికింది; మునిగిపోయింది.

వెంబడే పైకి లేచింది. గౌను ఒంటి కతుక్కుపోయింది. పొడుగాటి జట్టు, ముడివూడి, కంఠాన్ని చుట్టేస్తూంది. ధైర్యంగా బారవేస్తూ ఒడ్డుకేసి యీదడం మొదలెట్టింది.

భయంతో ఒక్క క్షణం అలప్మెదడు పనిచెయ్యలేదు. పరమాద్భుతం చూస్తున్నవాడిలా నిలబడి పోయేడు. కాని అంతలో తెలివి తెచ్చుకుని, తెడ్లు వేగంగా వెయ్యటం మొదలెట్టేడు. అతని చేతినుంచి రక్తం కారుతూ, పడవ లోపలంతా ఎర్రబడుతూనే వుంది.

లారెలా వేగంగా యీదుతున్నా అతడొక క్షణంలో ఆమెపక్కకి వచ్చేడు, "లారెలా! దేవుడితోడు, పడవలోకి రా, నాకు పిచ్చెక్కి అల్లా చేసేను. అప్పుడేం చేసేనో నాకే తెలియదు. నన్ను నువ్వు క్షమించను కూడా వద్దు. లోనికి రా!"

ఆమె విననట్టు యింకా యీదుతూనే వుంది.

"నువ్వీదలేవు. ఒడ్డింకా రెండు మైళ్ళుంది. మీఅమ్మకోసమేనా రా నీకు దుఃఖం కలిగితే నేబతకను" అన్నాడు ఆవేగంతో—

మారం కంటితోచే చూసి, మాట్లాడకుండా పడవఅంచు పట్టుకుంది. ఆబరువుకి, బల్లమీదున్న అతనికోటు నీటిలోకి పోయింది. ఆమె వేగంగా పడవలోకి ఎక్కేసింది.

ఆమె గుడ్డలు పిండుకుని, జట్టు సరిచేసుకుని చూసేసరికి పడవంతా రక్తమయమైవుంది. తెడ్లు వేస్తున్న అతని చేతినుండి యింకా రక్తం కారుతూనే వుంది. తన రుమాలు తీసుకోమంది. ఆంటోనియో తల విసురుగా తిప్పి, తెడ్లు వేస్తూనే వున్నాడు. కాస్సేపు వూరుకుని మళ్ళీ లేచి అతని దగ్గరకెళ్ళి రుమాలు గాయంమీద గట్టిగా కట్టింది. అతడు వొద్దన్నా లక్ష్యపెట్టకుండా ఒకతెడ్డేయడం మొదలెట్టింది. ఇద్దరూ కూడ నిశ్శబ్దంగా వెలవెలబోతూ వున్నారు. వాళ్ళు ఒడ్డుకొచ్చిన తరువాత

పడవవాళ్ళు ఆంటోనియోను హుషారుచేస్తూ లారెలాని వెక్కిరించారు. ఇద్దరూకూడా వాటికేం లక్ష్యపెట్టలేదు.

లారెలా గట్టుమీదికి దుమికింది. ఒడ్డునే వున్న మనిషి ఒక రైతు.—

"ఆంటోనియో! అదేమిటి, పడవంతా రక్తం, చెయ్యంతా గాయం" అంది.

"అబ్బే! ఏం లేదు. మేకు తగిలి చీరుకు పోయింది. వెధవ మేకు" అన్నాడు.

"వుండు నన్నొచ్చి కట్టుకట్టనీ మందేసి" అంది.

"అబ్బే అక్కరలేదు. రేపు పొద్దున్నకి పోతుందిలే" అన్నాడు.

లారెలా సెలవు తీసుకుంది. ఆంటోనియో ఆమెకేసి చూడనే లేదు. తన సామాను పట్టుకు తన గుడిసెకి వెళ్ళిపోయేడు.

ఇంట్లో ఆంటోనియో వంటరిగా వున్నాడు. సముద్రంమీద నుంచి గాలి చల్లగా వస్తూంది. అటూయిటూ తిరుగుతూ దేవుని పటం ముందు నిలబడ్డాడు. ప్రార్థన చెయ్యబుద్ధేయలేదు. ప్రార్థనెందుకోసం? అను కున్నాడు.

ఆరోజు గడిచేలా లేదు. రాత్రి చాలా సేపటిదాక అల్లా పచారు చేస్తూనే వున్నాడు. రక్తంపోయి. చాల నీరసంగా వుంది. చెయ్యి బాధగా వుంది. మంచంమీద కూర్చుని కట్టువిప్పేడు, రక్తం పైకి చిమ్మింది. చన్నీళ్ళలో గాయం కడిగేడు. చేతిమీద లారెలా పళ్ళు చక్కగా కనిపిస్తున్నాయి.

"మంచిపనే చేసింది" అనుకుంటున్నాడు. "నేను పశువునై పోయాను. ఈ రుమాలు రేపు ప్రొద్దుటే పంపించేస్తాను. నా మొహం చూపించనింక." ఆజేబురుమాలు జాగ్రత్తగా వుతికి ఆరేసేడు. గాయంకి కట్టు కట్టేసుకుని నీరసంతో మంచంమీద పడి, కళ్ళు మూసేడు.

హఠాత్తుగా మెలకువొచ్చింది. వెన్నెల పుచ్చపువ్వులా కాస్తూంది. చేతిబాధ ఎక్కువవడం మూలాన లేచి, చన్నీళ్లు పోస్తున్నాడు. యింతలో తలుపు చప్పుడై, లారెలా గుడిసెలోకి వచ్చి నుంచుంది. తలనున్న రుమాలూ, బుట్టా బల్లమీదపెట్టి నిట్టూర్చింది.

"జేబురుమాలు కోసం వచ్చేవా? ప్రొద్దుట నేనే పంపించేద్దామనుకుంటున్నాను" అన్నాడు.

"రుమాలుకోసం కాదు. మందుకోసం కొండమీదికి చాలా రాత్రుండగానే వెళ్లేను. యిదిగో చూడు" అని త్వరగా అంటూ బుట్ట మూత తీసింది

"అనవసరశ్రమ—చాలా అనవసరం. బాధ తగ్గేపోయింది. కాకపోయినా నాకు శిక్ష జరగవలసిందే. ఇల్లాటపు డెందుకు వచ్చావు? ఎవరేనా చూస్తే, ఎంత అపవాదొస్తుంది!" అన్నాడు.

"ఎవళ్ళమాటలు నేలెఖ్ఖచెయ్యను. నీచెయ్యి చూసి, మందుకట్టిపోదామని వచ్చేను." అంది, ఆవేశంతో.

"నేచెప్తున్నా. అంత అవసరంలేదు."

"పోనీ నన్ను చూడనీ."

అతని చెయ్యి తీసి చూసింది. ఆగాయం, ఆవాపు చూసి అమ్మో! అని జలదరించింది.

"కొంచెం వాచిందంతే. ఓరోజులో పోతుందిలే."

"అధమం వారం రోజులైనా పడుతుంది బాగుపడ్డానికి" అంది తల తిప్పుతూ.

"కాకపోతే ఒకటి, రెండు రోజులు అయినా పోయిందేముంది?" అన్నాడు.

మూకుడుతో నీళ్ళుతెచ్చి గాయం జాగ్రత్తగా కడగడం మొద

లెట్టింది. చంటిపిల్లాడిలా వూరుకున్నాడు, ఆంటోనియో. గాయం పైన మందువేసి ఉన్ని గుడ్డతో చక్కగా కట్టు కట్టింది.

కట్టు కట్టడం అయి పోయాక, "అభివందనాలు. కాని, నాకోరి కోటుంది. నన్నుక్షమించాలి. ఆపిచ్చిలో నేనన్నవీ, చేసినవీ క్షమించాలి. ఆతప్పు నీదికాదు. ఇంకెప్పుడు నిన్ను బాధపెట్టను" అన్నాడు.

మధ్యలో "నిన్ను నేను కోరాలి క్షమార్పణ. నేను సాఫీగా మాట్లాడితే యీగొడవే లేకపోవును. మరి ఆకరవడం........" అంది.

"ఆఁ, అది ఆత్మరక్షణ. లేకపోతే నాకు తెలివే రాకపోవును. నువ్వు నాకు మంచినే చేసేవు. అందుకు సంతోషం. నీ రుమాలిదిగో, తీసుకుపో."

కాని లారెలా సందేహిస్తూ, మనస్సులో బాధపడుతూ నిలబడింది. "నాతప్పువల్లే నీకోటు నీటిలో పడిపోయింది. ఆకోటు జేబులోనే, నారింజలమ్మిన బాపతు డబ్బుందని నాకు తెలుసు. నేను వెంటనే ఆడబ్బు యివ్వలేను. ఇంటిదగ్గరకూడా ఆట్టేలేదు. కాని—యీవెండి క్రాస్— యిది ఆచిత్రకారుడు వొదిలిపోయేడు. నువ్వు యిది పుచ్చుకుని అమ్మేస్తే కొంతవస్తుంది. మిగతాది నేసంపాయించి తీర్చేస్తాను. రాత్రిళ్లు నూలు వడకి నేసంపాయించగలను."

"అది నేను చస్తే తీసుకోను." అన్నాడు. ఆమె బల్లమీదపెట్టిన క్రాస్‌ని తోసేస్తూ.

"తీసుగు తీరాలి. నీచెయ్యి ఎప్పటికి కుదురుతుందో ఎవరు చెప్ప గలరు. ఆక్రాస్‌తో నాకేం పనిలేదు" అంది.

"సముద్రంలో పారెయ్యి."

"ఇది నీకేం బహుమతీకాదు. అది నీకు రావలసింది మాత్రమే. అదేన్యాయం."

"నీనుంచి నాకు రావలసిందేం లేదు. నామీద దయవుంటే, యీాపైని నేను కనపడ్డపుడు నాకేసి మాత్రం చూడకంతే. నువ్వు నాకేసి చూస్తే నేచేసిన పనిజ్ఞాపకం వస్తుంది. ఇంక నేను చెప్పాలిసిందేంలేదు."

రుమాలు, క్రాస్ బుట్టలోపెట్టి మూతేసింది. లారెలా ముఖంలోకి చూడగానే అదరిపడ్డాడు. ఆమె ఏడుస్తూంది. పెద్ద నీటిబొట్లు చెక్కిళ్ళ మీంచి కిందకి జారుతున్నాయి. వాటి నాపదాని కామె ఏం ప్రయత్నం చెయ్యటంలేదు.

"లారెలా" అని ఆంటోనియో అరిచేడు. "వణకుతున్నావు. వంట్లో బాగుండలేదా ?"

"ఏం లేదు. ఇంటికి పోతాను." అంటూ భారంగా ద్వారంకేసి అడుగులెడుతూ, హఠాత్తుగా గోడకి జేరబడిపోయి బిగ్గరగా ఏడ్చేసింది. ఆంటోనియో ఆమెని సమీపించేలోగానే, వెనక్కి తిరిగి అతని మెడలో చేతులువేసి, గుండెలమీద వాలిపోయింది. దుఃఖభారంతో మునిగిపోయే మనిషి చేతికిదొరికిన సహాయాన్ని పట్టుగున్నట్లు అతనిమీద వేలాడుతూ, "నేను భరించలేను. నువ్వంతదయగా మాట్లాడి, నన్ను వెళ్ళమంటూంటే నాహృదయం ధిక్కరిస్తూంది. నేచేసిన తప్పుకి నువ్వు శిక్షించకపోడమే నన్ను కాల్చేస్తూంది. నన్ను శపించు, కొట్టు, చంపెయ్యి. కాని యింకా నన్ను నువ్వు ప్రేమించేటట్టయితే నన్నిక్కడే వుండనియ్యి, పంపించెయ్యకు." ఏడుపులో యింక మాట్లాడలేక పోయింది.

నోట మాటలేకుండా, ఆమెని కొంతసేపు పొదివి పట్టుకున్నాడు. "ఇంకా నిన్ను ప్రేమిస్తూంటేనా ?—ఆగాయంగుండా నాహృయదరక్తం పోయిందనుకుంటున్నావా ? అది నాగుండెల్లో ఎలా కొట్టుకుంటూందో నీకు వినపడ్డం లేదూ, నీదగ్గరికి వచ్చేస్తానన్నట్టు. కాని, ఆమాటలు, నువ్వు నన్ను పరీక్షించడానికి కాని, జాలితోకాని అన్నట్టయితే నేను మరిచిపోగలను. నువ్వు నాకేం బాకీపడిలేవు."

నీళ్ళతో నిండిన కళ్ళతో, అతని భుజంమీంచి ముఖం ఎత్తి అతని కళ్ళలోకి చూస్తూ, "కాదు; జాలితోటి కాదు. నిన్ను ప్రేమించేను కనుకనే. విను. నేను నిన్ను ప్రేమిస్తానేమోనని భయపడే, అంత విముఖంగా వుండేదాన్ని. ఇప్పుడు మారిపోయేను. నీకేసి చూడకుండా వీధిలో నిన్ను దాటి పోగలనా? నీసందేహం పోడాని కిప్పుడు నిన్ను ముద్దెట్టుకుంటాను. "లారెలా నన్ను ముద్దెట్టుకుందని" నువ్వు చెప్పొచ్చు. లారెలా తనభర్తని తప్ప యితరుల్ని ముద్దెట్టుగోదు."

అతన్ని మూడుసార్లు ముద్దెట్టుకుని, తప్పించుకుంది.

"ఇంక వెళ్ళొస్తాను. పడుకుని నిద్రపో. గాయం తగ్గిపోతుంది. వంటరిగా వున్న నిన్నుచూస్తే తప్ప నాకింకెవరన్నా భయంలేదు."

వెంటనే బయటి కెళ్ళిపోయింది.

ఆంటోనియో, కిటికీదగ్గరే నుంచుని, దూరంగావున్న ప్రశాంత సముద్రంకేసి చూస్తూన్నాడు.

* * * * *

పురోహితుడు వివాహమందిరంలో కూచున్నపుడు నవ్వుతూ అన్నాడు. "ఎవరనుకున్నారు? భగవంతుఁడు నిస్సహాయమైన ఆచిన్ని హృదయంపై యింతట్లోనే దయచూపుతాడని ఎవరనుకున్నారు? భగవంతుడి లీలలు మనం తెలుసుకోలేము. భగవంతుఁడు ఆమెను రక్షించుగాక. లారెలా కొడుకు, తండ్రి స్థానంలో కూచుని నన్ను సముద్రంలోకి తీసికెళ్ళే రోజుకోసం ఎదురు చూస్తూంటాను. అహఁ హఁ బాగుంది! కాళీశక్తి!"

తెలియని వలపు పరిణామం తలవని తలంపు.

34

# రివాల్వరు

## జె. యస్. ఫ్లెచెర్

నేనూ జేబులోంచి రివాల్వరు బైటికి తీసేటప్పటికి, అంతవరకూ మేఘాల చాటునున్న నిండుచంద్రుడు బయటి కొచ్చేడు. ప్రశాంతవాతావరణంలో పుచ్చపువ్వులాటి వెన్నెల రివాల్వరుమీద పడి తళతళా మెరిసింది. వజ్రకాంతిలా మెరుస్తూన్న దానికేసి సాలోచనగా చూస్తూ వుండిపోయాను.

"ఆశ్చర్యం" నాలో నేనే కొంచెం బిగ్గరగా అన్నాను. "చాలా ఆశ్చర్యంగా వుంది."

నావెనక్కాల అడుగులు చాలా తేలిగ్గా వేగంగా—వినపడ్డాయి. ఒక చిన్న చెయ్యి నాచేతిమీద పడింది. కాని నారివాల్వరున్న చేతిని పట్టుకొన్న గుప్పిడి మాత్రం చాలా బలమైంది—

సాదరంగానూ, అదుర్దాగానూ ఒక ఆడపిల్ల గొంతు వినబడింది.

"ఒద్దు—నామాట వినండి."

వెనక్కి తిరిగి చూసేను. ఏదో అడుగుతూన్నట్టున్న రెండు నల్లని కళ్ళు నాకళ్ళలోకి చూస్తున్నాయి. మనిషి కొంచెం సన్నంగానే వుంది. తెల్లటి దుస్తులు, కొంచెంగా అత్తరువుల వాసనకూడాను. "దయయుంచి మానండి—కాకపోయినా—చాలా క్రూరం—"

మేమిద్దరం కలసి ఒక వింత దృశ్యం కల్పించినట్లున్నాం. ఒక యువకుడు ఒక యువతి, నల్లటి, తెల్లటి దుస్తుల్లో, వెనకాల అద్భుత ప్రకృతి సౌందర్యం. స్వచ్ఛమైన వెన్నెల చుట్టూవుంది. మెడిటరేనియన్ సముద్రం దగ్గర్లోనేవుంది. మాంటీకార్లోలోని దీపాలు, చుట్టుపట్ల, తాడిచెట్లు, పువ్వులు, ఇంకా అందమైన చెట్లు. వాతావరణానికి సరిపోడానికో

అన్నట్లు, మెల్లగా, ప్రక్క మెక్కడనుంచో సంగీతం వినపడుతూంది.

నన్నలా అడ్డుపెట్టినామెను ఎగాదిగా చూసేను. ఆశ్చర్యంతోటి నానోరు తెరిచే ననుకుంటాను. అబ్బా. ఎంత గట్టిగా పట్టుకుంది, నాకుడి మణికట్టు.

రెండో చేత్తో నన్ను కొంచెం కదిలించింది. "వినపడిందా?" అంది ఆమె. "మీరల్లా—చెయ్యకూడదు." ఇప్పటికి సావకాశం దొరికింది నాకు మాట్టాడ్డానికి.

"నన్ను క్షమించాలి" నాచేతులు రెండూ బంధింపబడ్డ ఆ పరిస్థితుల్లో సాధ్యమైనంత మర్యాదతో అన్నాను. "మీరు—మీరు నేనెవర్నైనా కాలుస్తా ననుకుంటున్నారా?"

నెత్తికి కట్టిన వున్నిగుడ్డకింద, ఆమె కనుబొమలు ముడెయ్యడం చూసేను. ఆనల్లని కళ్ళు నన్నాశ్చర్యంతో పరికించేయి. కాని ఆమె, నాగుత్తిమాత్రం వదిలిపెట్టలేదు.

"ఎవర్నో చంపడానికా? మీరు మిమ్మల్నికాదూ?—" మిగతా వాక్యం ఆమె కళ్ళే పూర్తిచేసేయి.

"ఓహో!" ఆశ్చర్యంగా అన్నాను. "అందుకోసమా మీరు నన్నిల్లా బంధించింది? నేనాత్మహత్య చేసుకో బోతున్నా ననుకున్నారు కదూ?"

"మీరు చేసుకోబోవడం లేదా?" అంది, నీరసంగానూ, ఆశ్చర్యంగానూ.

"ప్రస్తుతం కాదు. నాకు తెలిసినంతవరకు, అజాగ్రత్తవల్లనైతే యేమోకాని, లేకపోతే అది జరగదు." అన్నాను.

ఆమె నాకళ్ళల్లోకేదో వెతుకుతూన్నట్లు చూసింది. నేనూచూసేను ఆమె కళ్ళల్లోకి సూటిగా.

"కృతజ్ఞుణ్ణి!" అన్నాను కొంచెం ఆగి. అంత బలమైన వేళ్ళా

చేతులూవున్న మీకు ధన్యవాదాలు. అవి నన్ను కదలకుండా చేసేయంటే, నమ్మండి."

ఒకటి రెండడుగులు వెనక్కేసింది. వంతెనమీదపెట్టిన రివాల్వరు కేసీ, నాకేసీ చూస్తూంది. ఆమె కళ్ళల్లో ఏదో తెలిసికోవాలనే భావం కన పడుతోంది.

"మీజేబులోంచి అంత హఠాత్తుగా తీసే రెందు కది?" అంది. కొంచెం బిరుసుగానే. "మీరు కాల్చుకోబోతున్నారనే నేనమ్మాను— అప్పే నేననుకున్నాను. చెప్పేరుగా కాదని—కాని—"

"తెలిసింది" అన్నాను, అర్థోక్తిలో. "రివాల్వరు పైకి యెందుకు తీసేనా? వూరికే ఒకసారి దానికేసి చూద్దామని బయటికి తీసేను."

రివాల్వరు బైటికి అంత హఠాత్తుగా ఎందుకు తీసేరని అడుగు తూన్నా?" నంది ప్రతిమాటా ఒత్తి పలుకుతూ, మళ్ళీ.

"హఠాత్తుగా ఎందుకు తీసేనా? దాన్ని చూడాలని హఠాత్తుగా తట్టింది."

మూతి చిన్నదిచేసి, కనుబొమలు పైకిలాగి నాకేసి చూస్తూ నుంచుంది. ఆమూతి చాలా అందంగా వుంది. తెల్లటి వున్నిగుడ్డలోంచి కనపడుతూన్న ఆమెకంఠం చూస్తే, చాలా అందమైన మనిషని సుల భంగా తెలిసిపోతుంది. ఆమె కాలి బొటనవేలు రోడ్డుమీద తాటించడం వాలకం చూసి, కోపంగా వుందనుకున్నా.

"అదో కుంటికారణం" అంది కఠినంగా.

"ఎవర్నేనాకాని, తననికాని, కాల్చడానికి కాకపోతే ఎవదేనా రివాల్వరు హఠాత్తుగా పైకి తీస్తాడా?"

"తీయడని ఒప్పుకుంటాను. కాని మీకు సులభంగా నచ్చేలా చెప్పగలను. మీరెప్పుడేనా బజారు కెళ్ళినప్పుడు "అరే! నాపర్సు ఎక్క డుంది?" అని ఎప్పుడూ తడిమి చూసుకోలా?"

"అహఁ. నాకెప్పుడూ అల్లాటి అనుభవం లేదుగాని మీరిచ్చిన వుదాహరణ బాగానేవుంది. అదా! సంగతి. వూరికేనే తీసేరన్నమాట బయటికి? కాల్చడానికొక్కాదు." అంది సాఫీగా.

తల ఊపేను ఔనన్నట్టు.

"నేను దాన్నుపయోగించనని చెప్పలేదు. దాన్నుపయోగించాలనే అనుకుంటున్నాను—చాలా మంచిరివాల్వరిది."

అనుమానం, చీకటిలా మళ్ళీ ఆమె ముఖంలో కమ్ముకుంది.

"వాళ్ళు చేసేదేమిటో నిజంగా చెప్పేమనుష్యుల్ని. నేను హర్షిస్తాను." అంది.

"అయితే ఆసుగుణం నాకు పూర్తిగా వుంది. యెంచేతంటే నేచెప్పిందంతా చేద్దామనుకున్నదే."

"ఎవర్నీ కాల్చకుండా రివాల్వరెల్లా వుపయోగిస్తారు." మళ్ళీ అంది "బహుశా కుక్కల్ని కాలుస్తారా?"

"ఈవేళకి దీల్లో తోటాలేం లేవు. ఖాళీగానే వుంది. రేపుమాత్రం దీన్ని వుపయోగంలో పెడతాను."

ఆమె కనుబొమ్మలు విల్లులా వంగేయి. రివాల్వరు చేతిలోకి తీసికొని ఆమెకేసి చాచేను.

"చూడండి. స్వచ్ఛమైన లోహంతో నేర్పరులైన పనివాళ్ళచేత, చాలా అందంగా చేయబడింది. తీసుకోండి. ఫరవాలేదు."

రివాల్వరు చేతులోకి తీసికొని కుతూహలంతో చూసింది. వెన్నెలలోనూ దీపాలవెల్తురులోనూ దాన్ని తిరగాబోర్లా వేస్తూన్న ఆమెకేసి చూస్తూ నించున్నాను. ఆమె మరీచిన్నపిల్లకాదు. యిరవై ఏళ్లుండవచ్చు. నాజూకుగా, అందంగా, అవయవాలు తీర్చి దిద్దినట్టున్నాయి. కళ్లు నల్లగా వున్నాయి. తలగుడ్డలోంచి కనిపిస్తూన్న జుట్టు కొంచెం బంగారు వర్ణంగానే వుంది.

కనుబొమ్మలు పెద్దవి చేసింది. మళ్ళీ రివాల్వరుకేసి చూస్తూ.

"రాళ్ళుకూడా పొదిగేరు" అంది సాశ్చర్యంగా.

"వట్టి దూబరాఖర్చు."

రివాల్వరు నాకిచ్చేసింది.

"ఐదు నిమిషాల క్రితం, ఇది ఖాళీదని తెలిస్తే బాగుండి వుండేది. రభస అనవసరంగా జరిగింది."

హఠాత్తుగా రెప్పలక్రిందనుంచి నాకేసి ఒక చూపు విసిరింది.

"ఇప్పుడు దాంతో ఏంచేద్దామనుకుంటున్నారు." అంది.

రివాల్వరు జేబులో పెట్టేసేను. ఆమెలో నమ్మకం కల్గినవాడిలా, కొంచెం బిడియపడుతూ, ఆమె కేసి చూసి "నేను—దివాలాతీసేను." అన్నాను.

ఆమె కాసినో హోటలుకేసి తిరిగి తలాడిస్తూ,

"దాంట్లోనా" అంది.

తల ఊపేను.

బొటనవేలుతో రోడ్డుమీద పొడుస్తూంది. సంగీతంకూడా మాస్థితి గ్రహించినట్టు, మంద్రంలోకి కొంచెం మారింది.

"దివాలా తీసేక, డబ్బు సంపాదనకి మళ్ళీ యెత్తులేవో వెయ్యాలి కదా ?"

"రోమియో అన్నాడు 'ఉపాయాలు వెతుకుదా' మని" అన్నాడు, కొంచెం సేపాగ్ని మళ్ళీ.

"రోమియో, డబ్బుగురించి కాదూ, అల్లాగ అన్నది" అందామె.

"నిజమయినా నేను మీతో తగాదా పెట్టుకోను, ఎంచేతంటే, రోమియోకి కావలసినది విషం, దానికి సాధనం కావాలి. అదేడబ్బు. నేను చెప్పేదేమిటంటే, డబ్బు అయిపోయినప్పుడు మళ్ళీ డబ్బు పుట్టించాలి. నారివాల్వరు ఖరీదైంది, నేచెప్పింది అర్థమైందా మీకు."

"ఆఁ. దాన్నికూడా జూదంలో ఒడ్డుదామనా?"

"అంకంటే 'అమ్మడం' సరైనమాట. చూసేరా, పూర్తిగా డబ్బంతా అయిపోయాక, ఆలోచనకి కొద్దిమార్గం వచ్చేనంతే. నాతో నేనే ఆలోచిస్తున్నాను. నాదగ్గిరెప్పుడూ ఓరివాల్వరుంటుంది. ఖాళీదే లెండి. ఎప్పుడూ కనపడని దొంగల్ని బెదరించడాని కుపయోగిస్తుందని. అది బైటికితీసి ఎంతచేస్తాయో ఆలోచిస్తూ, "ఆశ్చర్యం" అన్నాను. అంతలో మీరొచ్చి బంధించేసేరు."

పున్నిగుడ్డ, నెత్తిమీదకీ, బుజాలమీదికీ ఇంకా లాక్కుంది. చలే స్తూంది కాబోలు.

"కొంచెం అల్లా నడుద్దామా?" అంది.

"ఓఁ. సంతోషంతో. నేనో సిగరెట్టు కాలుస్తే మీకభ్యంతరం—" అనుజ్ఞ యిచ్చింది. అక్కడే అటూ యిటూ తిరగడం ప్రారంచేం. ఆసంగీతం చాలా ఆనందదాయకంగా వుంది. నేనుకూడా కూనిరాగం తియ్యడం ప్రారంభించేను.

"డబ్బంతా పోయి రివాల్వర్లమ్ముకునే స్థితిలో వుండేవాని కంటే మీరు చాలా ఆనందంగా కన్పిస్తున్నారు." అంది ఆమె. "అది నిజంగా నేనా? లేక కల్పించుకున్నదా?"

"నేను నిజంగా సంతోషంగానే వున్నాను. చక్కటి రాత్రి, ప్రక్కన మీలాటి మంచి స్నేహితురాలు. రివాల్వర్ని రేపు అమ్ముకో వచ్చును. కొత్త వస్తువులు కొనే యూదీయుడొకడున్నాడు. యూప్రాం తాన్నే. అధమం నూటయాభై రూపాయలైనా చేస్తాయి ఆరెండూను. కాని వాడంత యివ్వడు. చూడండి బీదవాళ్ళ పాట్లు."

"డబ్బులేకపోవడం అంటే ఏమిటో తెలుసా యిదివరకు మీకు?" అంది, స్త్రీ సహజమైన ఆతృతతో

నాకు నవ్వొచ్చింది.

"ఆఁ. బోలెడన్ని సార్లు"

"అదికాదు. పెద్దవాణ్ణైం తర్వాత."

"పెద్దైం తర్వాతకంటె, చిన్నప్పుడే ఎక్కు వవసరం వుండేది. రేపటి నాడబ్బవసరం కంటె, స్కూలు రోజుల్లో డబ్బవసరం ఎక్కు వగా వుండీదంటె నమ్మండి."

ఆరివాల్వర్నమ్మిన డబ్బుతో, మళ్ళీ జూదం ఆడతారా?" అంది నిట్టూరుస్తూ.

"అదే నేనూ ఆలోచిస్తున్నాను. మనకి ప్రసన్నంకాని లక్ష్మీదేవిని ఆరాధించే కంటే, యింకోదేవిని ఆరాధిస్తే మంచిదని తోస్తూంది."

"మీరు జూదంలో చాలా డబ్బు పోగొట్టుకున్నారా?"

"నేను పోగొట్టుకున్నది ధనవంతుడి దృష్టిలో కొంచెమేకాని, పేదవాడి దృష్టిలో మాత్రం చాలా ఎక్కువే. కాకపోయినా గతాన్ని గురించి విచారించడ మెందుకు? గతజలసేతుబంధనం వెర్రితనమని సామెతకూడా వుంది:" అన్నాను.

"జూదంలో డబ్బు పోగొట్టుకొన్న నిర్భాగ్యులు చాలామంది ఆత్మహత్య చేసుకుంటారని అనుకున్నాను నేను. అందుచేతే నేను— మిమ్మల్ని—"

"—బంధించేరా? దాని కింకా మిమ్మల్నభినందించవలసిన బాధ్యత నాపై నుందన్నమాట."

"నేననుకున్నట్టుగా మీవుద్దేశం అది కానప్పుడు, మీరు నన్నభినం దించ నక్కర్లేదు."

"అబ్బే! దాని ప్రాముఖ్యతేమంటే, మీసదుద్దేశ్యం. నేను చెయ్య బోతున్నా ననుకున్న ఆపనినుంచి మీరు ధైర్యంతో, దయగా తప్పించేరు. అందుకు ధన్యవాదాలు."

ఆమె చురుగ్గా చూసింది నాకేసి.

"మీమాటల్లో కొంచెం వెక్కిరింపు కనిపిస్తోంది."

ఆమె మూతిని చాలా అందంగా బిగించింది.

"మీరు మిథ్యావేదాంతులు కాబోలు." అంది.

"అవ్వే, కాదుకాదు. నేను ఉమర్‌ఖయామ్‌కి నిజమైన అనుచరుణ్ణి. చూడండి. యీప్రపంచం అంతా ఒక చదరంగపుబల్ల; ఉమర్‌ఖయ్యామ్ అన్నట్లు. నాజీవిత మొక పావు. అంచేత—"

నామాటల కనుగుణంగా చేతులుకూడా ఆడిస్తున్నాను. మెడిటరేనియన్ సముద్రం ప్రక్కన, వెన్నెలరాత్రి, అపరిచితమైన, అందమైన పడుచు పిల్లతో మాట్లాడతగింది కాదేమో, వేదాంతం అని, ఆగేను.

"ఎడారిలో మీరో చిన్నరొట్టెతో సంతృప్తి పడరని నావుద్దేశం" అంది.

"ఆకవి సంతోషించిన దానితో నాకూ తృప్తి కలుగుతుంది." అన్నాను. "మీకు జ్ఞాపకం వుండేవుంటుంది. ఆకవికి—రొట్టేకాక, ద్రాక్షరసం, స్త్రీలు, కవిత్వం—కూడా వున్నాయి. కవిత్వం మధురంగా వుంటుందనుకోండి; మరి స్త్రీలు, ద్రాక్షరసం—" ఆమె నిశ్శబ్దంగా వుండడం చూసి, నేనూ ఆగేను.

"మీకేం అపాయం కలగబోదని నాకు నిశ్చయమైంది కనుక నేనింక పోతాను. నమస్కారం" అంది.

నేనూ వంగి నమస్కారం చేసేను.

"మిమ్మల్ని మళ్ళీ యింకోసారి అభినందిస్తున్నాను మీసదుద్దేశానికి; మీరు, సమయానికి రావడం. చాలా మంచిపని అయింది. నమస్కారాలు" అన్నాను. తల వూపి కొంచెం నవ్వింది.

"రివాల్వర్లు మీఅదృష్టాన్ని బాగుచేస్తాయని ఆశిస్తున్నాను. ఇంకజూదాని కెళ్ళరుకదూ?" ఆమె మళ్ళీ నవ్వి, వెనక్కి తిరిగి వెళ్ళి

పోతూంది. మాసమావేశం పూర్తయిపోయింది. మళ్ళీ ఎప్పుడేనా కలుసుకోగలనా? ఆమెని.

హఠాత్తుగా ఆమె పక్కకి అడుగేసేను. "ఏమండీ!" అన్నాను.

ఆమె వెనక్కి తిరిగి కొంచెం ఆశ్చర్యంతో నిలబడింది. వంగి నమస్కారం చేసేను.

"ఇందాకటినుంచీ మీకు నేచెప్పినవన్నీ అబద్ధాలు. వట్టిఅబద్ధాలు. నేనెవర్నీ కాల్చబోవటమూ లేదు. రేపు రివాల్వర్లు అమ్మబోవటమూ లేదు. నిజమేమిటంటే—నాకు రివాల్వరు కాల్చడంలో మంచి సూటి వుంది. ఈరెండూ కొత్తగా కొన్నాను. మీరొచ్చే సమయానికి, ముప్ఫై అడుగుల దూరంనించి, ఇస్పేటు జాకీలో చుక్కని కొట్టగలనా? కొట్ట లేనా? అని ఆలోచిస్తూ, వాటిని బయటికి తీసేను. అంతే. మిగతా నేచెప్పిందంతా శుద్ధఅబద్ధం." అన్నాను.

ఆమె నిర్ఘాంతపోయి చూసింది. కాస్సేపుండి యిల్లా అంది.

కొంచెం కోపంగా, "అయితే, అంతసేపూ, నిజం ఎందుకు చెప్పలేదూ?"

నేనన్నాను మర్యాదగా "మెగొంతుక, చాలా మృదువుగావుంది. మీరు చాలా దయగా కన్పించేరు. అంచేత—"

నిట్టూర్చింది. ఎందుకోసమో, నేనే సరిగ్గా చెప్పలేను.

"నేనింటికి పోతున్నా. ఆలోచించాలి." అంది వెనక్కి ఒకటి రెండడుగులు వేస్తూ.

"బాగుంది. దేన్నిగురించి—" అన్నాను.

"మొగాళ్ళ మాయల్ని గురించి—వెళ్తాను" అంది.

"రేపు నేను మీతో—" అన్నాను.

"యింకా అబద్ధాలు చెప్పడానికి అవకాశం కావాలా?" అని ప్రశ్నించింది, నామాట సగంలోనే.

"నేను నిజం బాగానే చెప్పగలను. అదే నాకలవాటు అసలు" అన్నాను.

"ఎప్పుడూ నిజమే మాట్లాడితే బాగుండేదిగా" అంది నిశ్చలంగా.

"నేను మీతో చెప్పింది మంచి కల్పనే అయినా, నానోటివెంట మీరింక అబద్ధం ఎప్పుడూ వినరు" అన్నాను.

నవ్వేసి, నడవడం మొదలెట్టింది. నేనూ ఆమె ననుసరించేను.

"మళ్ళీ మిమ్మల్ని కలుసుకుని మీతో మాట్లాడాలని వుంది." అన్నాను.

"పదకొండు గంటలకి చాలా అనుకూలంగా వుంటుంది" అంది మెల్లిగా.

"ఇక్కడే కలుసుకుందామా?" అన్నాను చుట్టూ చూస్తూ.

"కాని మీరు అబద్ధాలు చెప్పకూడదు. నేను చాలా తెలిసికోవాలిసి వుంది." అంది.

"ఓ! పుస్తకంలా విప్పుతాను నాహృదయం మీముందు" అన్నాను.

"ఆపుస్తకంలో ఏముంటుందో" అంది.

"ఒకటి రెండు పేజీలు తిరగేసి మీరే చూద్దురుగాని" అన్నాను. నాకు నమస్కారం చేసి వెళ్ళిపోయింది. కాసినోనుంచి మళుపు తిరుగుతూ, నాలో నే అనుకుంటున్నాను.

"ఆమెని ప్రేమించానేమో అంటే ఆశ్చర్యం ఏం కనపడ్డంలేదు. మనిషి, హృదయంకూడ, చాల అందమైంది. దాంట్లో ఆశ్చర్యమేముంది."

రాత్రి హొటల్లో రివాల్వరు డ్రాయరులో పెట్టేసేటప్పుడు రివాల్వరు నామె తాకినచోటు జ్ఞాపకం వచ్చింది. అప్పటి వెన్నెల రివాల్వరు మీదా ప్రతిఫలించింది. నాహృదయంమీదా ప్రతిఫలించింది.

మర్నాడు ప్రొద్దుట హొటల్లో మేజరు పోన్సన్‌బీతో ఫోంచేస్తు

న్నాను. మేజరుకి యాభై ఏళ్ళుంటాయి. చాలామంది నెఱుగును. వాళ్ళని గురించి, వాళ్ళకంటే యీయనకే ఎక్కువ తెలుసు. ఆయనతో భోంచేస్తూన్నపుడు పేపర్లలో లేని సంగతులు తెలుస్తాయి కూడాను.

"ఆయనతో మాటాడుతూ, మధ్యలో తలెత్తి చూసేను. నానరాలన్నీ ఒక్కమాటు చలించాయి. ఒళ్ళు పులకరించిందికూడాను. నాకుడిచేతి ప్రక్కన టేబిలువద్దనే, ఆమె—చాలా అందంగా వుంది—కూచుంది. ఆమెతోటి బంగారు కళ్ళజ్రేమున్న, ఒక పెద్దవయస్సాయనా, మరో యువతీ కూచున్నారు. వాళ్ళు అమెరికన్లేమోనని తట్టింది నాకు. ఆపిల్ల గొంతులోమాత్రం వాళ్ళ వుచ్చారణేం లేదు.

"మేజర్, మీకందరూ తెలుసుకదా! మనకుడిప్రక్కన వాళ్ళెవరో చెప్పండి."

పోన్సన్‌బీ జాగ్రత్తగా తిరిగి వాళ్ళని పరీక్షగా చూసేడు.

"ఆఁ. వాళ్ళా. అమెరికన్లు. నిన్ననే వచ్చేరు. ఆయన తండ్రి, చికాగో, పేరు మూనీ, కోటీశ్వరుడు. ఆచిన్నపిల్ల కూతురు. పేరు డయమండ్‌మూనీ. ఒక్కత్తే వారసురాలు ఆయన ఆస్తంతకీ. రెండో యువతిపేరు గ్రాంట్, ఆమెకి చెలికత్తె." అన్నాడు.

నేను వాళ్ళున్న వైపు చూసేను. ఆమెకూడా యిటు చూసింది. మాయిద్దరి కళ్ళూ కలుసుకున్నాయి. ఏమీ ఎరగనట్టూరుకున్నాం. కాని పదకొండింటికి కలుసుకుంటామని నిశ్చయమైంది నాకు.

సరిగ్గా పదకొండింటికి అక్కడికి కొచ్చింది. ఒక్కత్తే. "భోజనం అయేక చాలా టైమైంది" అన్నాను.

"సరిగ్గా, ఒక గంటా ఐదు నిమిషాలయింది" అంది.

సముద్రంలోని నీలిదనాన్నీ, కొండల ఎరుపునీ చూస్తూ కూచున్నాం కాసేపు.

"ఏమిటి?" అంది ఆఖరికి.

"ఏమిటి?" అన్నాను నేనుకూడా.

"మీరు ఆలోచన్లో వున్నట్టున్నారు" అంది.

"మీరు విచారంగా వున్నట్టున్నారు" అన్నాను.

"వెన్నెల కాయటంలేదు. అందుకనేమో." అంది.

"అయినా మంచి, సూర్యకాంతి వుందికదూ?" అన్నాను.

"వెన్నెలలో మనం ఒకరి నొకరెరగం"

"ఇప్పు డెరుగుదుమా?" అన్నాను.

నిట్టూర్చి, యిసకలో బొటనవేలితో ఏదో గీస్తోంది.

"మేజర్ పోన్సన్‌బీ, భోజనం అయాక చుట్ట కాలుస్తూ మానాన్నతో చాలాసేపు మాట్టాడేడు."

"మాట్లాడి వుండచ్చు."

ఆమె యింకా అంటూంది.

"ఐర్లండులో కల్లా గొప్పవంశీకుణ్ణి, రివాల్వరు అమ్ముకోకుండా రక్షించగలిగినందుకు సంతోషిస్తున్నాను. ఆయనకి అబద్ధాలు చెప్పే అల వాటుకూడా పోగొట్టాలనుంది."

చాలాసేపు నిశ్శబ్దంగా వూరుకున్నాను.

"ఆ దురలవాటుపోగొట్టే ప్రయత్నం కొంచెంచేస్తారా?" అన్నాను.

ఆతరువాత చాలా సేపు వూరుకుని,—

"బహుశా ప్రయత్నిస్తాను." అంది మెల్లిగా.

"యీలోగా వచ్చి మానాన్నను చూడండి."

* * * * *

అమెరికా కోటీశ్వరుని కూతురికీ, ఐర్లాండు భూస్వామికీ వివాహం జరుగబోతూవుంది.

ఇదంతా రివాల్వరు ప్రాబల్యమే!

---

# మేదరి పిల్ల

మపాసా

మార్క్వస్ డి బెర్ట్రాణ్ చేస్తున్న విందు ఆఖరవ వచ్చింది. వాళ్లు కూచున్న గదిలో దీపాలు దేదీప్యమానంగా వెలుగుతున్నాయి. టేబిలు మీద అందమైన పువ్వులు గాజుతొట్లల్లో అలంకరించబడి వున్నాయి. టేబిలుచుట్టూ పదకొండుగురు ఆటగాళ్ళూ, ఎనమండుగురు యువతులూ ఓడాక్టరూ కూచుని వున్నారు.

సంభాషణంతా ప్రేమమీద సాగుతూంది. ఒకే వ్యక్తి, హృదయ పూర్వకంగా చాల సార్లు ప్రేమించగలడా? అన్న సమస్యమీద వాగ్వాదం మాంచి జోరుగా సాగుతూంది. ఒక్కసారి మాత్రమే నిజంగా ప్రేమించ గల్గినవాళ్ళ వుదాహరణలూ; చాలా సార్లు, హృదయం అంతటితోటీ కూడా ప్రేమించిన వాళ్ళ వుదాహరణలూ దొర్లిపోతున్నాయి. ఆఖరికి మొగాళ్ళంతా ఓనిశ్చయాని కొచ్చేరు. ఒకే మనిషి చాలాసార్లు ప్రేమకి లోబడవచ్చుననీ, ఆప్రేమ సాఫల్యం పొందకపోతే చనిపోడానిక్కూడా సావకాశా లున్నాయనీ; ఆ అభిప్రాయం తృణీకరించ లేకపోయినా, యువతులంతా యింకో అభిప్రాయాని కొచ్చేరు. నిజమయిన ప్రేమ వ్యక్తిజీవితంలో ఒక్కసారే అనుభవించగలమనీ, ఆప్రేమ, మెఱుపులా మెరసి, వాళ్ళ గుండెల్ని కాల్చి, నరాల్ని వేడెక్కించి, వాళ్ళ హృద యాల్ని తనలో లీనం చేసేసుకుంటుందనీ, ఆహృదయాలు యింకే విధంగానూ, బలీయమైన మోహాలకీకూడా చలించవనీ నిశ్చయించేరు. చాలా ప్రేమసంబంధాల్లో అనుభవం వున్న మార్క్వస్ మాత్రం ఆడ వాళ్ళ పై అభిప్రాయాల్ని ఒప్పుకోలేదు.

ఆవివాదాన్ని, వాళ్ళంతా కలిసి డాక్టరుగారి ముందుంచేరు. ఆయన

నిశ్చయాన్ని వాళ్ళంగీకరించడానికి నిశ్చయించేరు. కానైతే ఆయనికి మాత్రం నిశ్చితాభిప్రాయాలు లేవు.

"మార్క్వెస్ చెప్పినట్లు, అది తత్వాలనిబట్టి వుంటుంది. కాని నాకో విషయం మాత్రం గుర్తుంది. ఒక వ్యక్తి యాభైఐదు సంవత్సరాలు, ఒక్క నిమిషమేనా విడువకుండా ప్రేమించి, ఆప్రేమతోనే చచ్చిపోయింది" అన్నాడు డాక్టరు.

యువతులంతా ఉత్సాహంతో చప్పట్లు కొట్టేరు.

"చాలా ఆశ్చర్యంగా వుంది. అట్లా ప్రేమిండబడ్డం ఎంత ఆనందంగా వుంది? ఆప్రేమ యెంత సౌందర్యమైనదో! అటువంటి ప్రేమని ఒక హృదయంలో రేపగల్గిన ఆమనిషెంత ధన్యుడోకదా!" అన్నారు యువతులంతా.

డాక్టరు నవ్వేడు.

"మీరు చెప్పింది ఒకవిషయంలో మాత్రం నిజం, అమ్మాయిలూ! అతడెవరో తెలుసా, ఛోకెట్. మనవూళ్లో రసాయనద్రవ్యా లమ్మేవాడు. ఆడమనిషెవరో తెలుసా, అతన్ని చూడ్డానికి ప్రతిసంవత్సరం యీవూరు వస్తూండేదే, ఆ మేదరిది!"

యువతుల వుత్సాహమంతా ఒక్కసారే చప్పగా చల్లారిపోయింది. వాళ్ళ ముఖాలమీద విసుగు కనిపిస్తూంది. ప్రేమ, త్యాగం, మొదలైన వున్నతానుభవాలూ, భావాలూ ఒక్క ఉన్నతకులీనులకే తప్ప యింకెవకీ వుండవని కాబోలు వాళ్ళ నమ్మకం.

డాక్టరు తనకథ చెప్పడం మొదలెట్టేడు. "మూడునెల్ల క్రితం ఆ ముసలిమేదరిదగ్గర కెళ్ళవలసొచ్చింది. ఆమె చనిపోయేందుకు సిద్ధంగా వుంది. ఆక్రితం రోజునే ఆమెకి గృహంగాకూడా వుపయోగించే, ఆబండిలో వచ్చిందీవూరు. ఆమె నల్లటి పెద్దకుక్కలు రెండూకూడా, ఆమెతోనే వున్నాయి. పురోహితు డామెకోసం, దేవుని ప్రార్థిస్తూ

అక్కడే వున్నాడు. ఆమె మాయిద్దర్నీ తన ఆస్తికి ట్రస్టీలుగా విల్లులో నియమించింది. అప్పుడే తన చరిత్రకూడా చెప్పింది. అటువంటి త్యాగ పూరితమూ, సామాన్యమూ అయిన కథను నేనెప్పుడూ వినలేదు."

"ఆమెతల్లీ, తండ్రీకూడా మేదరి వృత్తితోనే జీవిస్తూండేవారు. ఆమె యెప్పుడూ సరియైన యింట్లో నివాసమంటే యేమిటో ఎరగదు. చినిగిపోయిన గుడ్డలతో, మురికిగా, తల్లిదండ్రులవెంట వూరూరా తిరి గేది. వాళ్లు వూరు బయట బండీ ఆపి, గుర్రాన్ని మేతకి వదిలేసేవారు. కుక్క ఆప్రక్కనే ఎక్కడో నిద్దరోయిాది. ఆపిల్లకూడా, ఏచెట్టునీడనో మకాం చేసేది. తల్లిదండ్రుల్తో వాళ్ళ చిన్నగుడిసెలో సంభాషణలూ, ఆదరణలూ ఏం వుండీవికావు. ఇద్దరిలో ఎవరో ఒకరు, వూళ్ళోకి పోయి "పేము పనిచేస్తామండి పేముపనీ" అంటూ కేకేస్తూ పాతపేము కుర్చీలూ, ఉయ్యాలలూ వగైరా పోగుచేసుకొచ్చి, ఎదురెదురుగా కూచుని బాగుచేసేవారు. ఆచిన్నపిల్ల ఎక్కడికేనా కాస్త దూరంగా పోయినా, వూళ్ళో పిల్లల్తో ఎవరితోనేనా మాట్లాడినా, "ఇల్లారా, దొంగవెధవా!" అంటూ తండ్రి గదమాయింపు వినపడేది. అవి మాత్రమే, ఆచిన్నపిల్ల విన్న ఆదరణవాక్యాలు. కొంచెం పెద్దదవగానే, వూళ్ళోకి పోయి, కుర్చీలూ వగైరాలు పోగేసు కొచ్చీది. అల్లా తిరగడంలో వూళ్ళో పిల్లల్ని కొంచెం పలకరించీది. కాని, యిప్పుడు గదమాయించీది, ఆపిల్లల తల్లిదండ్రులు మాత్రమే.

"ఇల్లారా వెధవా! ఇంకెప్పుడేనా ఆదేశదిమ్మరితో మాట్టాడి చూడు!" అనీవారా పిల్లల తల్లిదండ్రులు.

"చిన్నచిన్నపిల్లలు ఆమెని సాధారణంగా రాళ్లుచ్చుగు కొట్టీవారు, కాని దయగల తల్లులెవరేనా, కానీ, అర్ధణా యిస్తే జాగ్రత్తగా దాచు గునీది, ఆమేదరి పిల్ల.

"ఆపిల్లకు పదకొండేళ్ళపుడా కుటుంబం యీప్రాంతాల కొచ్చింది.

గుడివెనకాల ఎవడో కుర్రాడు తనఅణాకాసు దొంగిలించేడని, చోకెట్ ఏడుస్తూంటే చూసిందా మేదరిపిల్ల. ఆపిల్లకి చాలా ఆశ్చర్యం వేసింది ఆ నాగరికుడి కన్నీళ్లు చూసి. పాపం ఆచిన్నపిల్ల, పట్నంలో పిల్లలంతా ఎప్పుడూ ఆడుకుంటూ సంతోషంగా వుంటారనుకొనీది. సంకోచిస్తూనే అతని దగ్గరకెళ్ళి, ఎందుకేడుస్తున్నాడో తెలిసికొని, తనదగ్గరున్న, కాని తక్కువ పదణాలూకూడా వాడిచేతుల్లో పోసింది. చోకెట్ మాట్లాడకుండా, కళ్ళు తుడిచేసుగుని, ఆడబ్బులు జేబులో వేసుగున్నాడు. అప్పటి సంతోషం పట్టలేక, ఆపిల్లవాడికో చిన్నముద్దుకూడా యిచ్చింది. వాడు డబ్బులు లెక్కెట్టుకోడంలోపడి ఏం అభ్యంతరం పెట్టలేదు. అది చూసి ఆపిల్ల చేతులు వాని మెడని చుట్టేసి, గట్టిగా గబగబా ముద్దులెట్టుగుని పారిపోయింది."

"ఆ అమ్మాయి వుద్దేశ్యం ఏమిటంటారు? వాళ్ళిద్దరకూవున్న సంబంధం ఏమిటి! తను దాచుకున్న డబ్బంతా వాడికిచ్చేసిందనా లేకపోతే మొదటి ముద్దు వాడికిచ్చిందనా? ఇటువంటివన్నీ పెద్దలకెల్లాగో, చిన్నలకికూడా అల్లాగే అకారణ జనితాలు."

"నెలల తరబడి, ఆ అబ్బాయిని గురించీ, గుడివెనకాల వాడేడవడం తలచుకుంటూండేది. మళ్ళి చూద్దామనే ఆశతో, తనకిచ్చిన డబ్బుల్లోవి దాచీ, తండ్రిదగ్గర కొద్దిగా చాటుమాటుని తీసీ, కొంత కూడబెట్టింది.

"మళ్ళీసారి ఆవూరు వచ్చేటప్పటికి రెండు రూపాయిలు జాగ్రత్త చేసింది. తన తండ్రి షాపులో రంగురంగుల సీసాలని చూస్తూన్న ఆకుర్రా డొక్కసారి కనిపించేడు. ఆరంగుల సీసాల్నీ, ఆషాపుఅందాన్నీ చూసి, ఆకుర్రాడ్ని మరీ ప్రేమించింది. వాడి ముఖం మాత్రం ఆపిల్ల మరిచిపోలేదు.

"తరువాత సంవత్సరం ఆవూరు వచ్చినప్పుడు స్కూలు పిల్ల

లతో కలిసి వస్తూన్నవాణ్ణి స్కూలు వెనకాల దొరకపుచ్చుకుని మెడకి చేతులు చుట్టేసి గట్టిగా ముద్దెట్టుకుంది. వాడు హడిలిపోయి ఏడుపు మొహం పెట్టేటప్పటికి వాణ్ణి పూరుకోపెట్టడానికి తను కూడబెట్టిన మూడు రూపాయిల అరణాలు వాడిచేతుల్లో పోసింది. వాడు ఆదబ్బుచ్చుకుని ఆపిల్లని యిష్టం వచ్చినట్టు ముద్దెట్టుకోనిచ్చాడు.

"ఆతరువాత నాలుగు సంవత్సరాలదాకా కూడా, కూడబెట్టిన డబ్బంతా యిస్తూండడం, కావలసినంతసేపు ముద్దులెట్టుకోడం. యిల్లా జరుగుతూండేది. ఓసారి మూడు పావులాలు, ఇంకోసారి రెండు రూపాయీలు, ఇంకోసారి అరణాలన్నరా—అప్పు డామె ఏడ్చిందికూడా, యింత తక్కువ యిస్తున్నానని—ఆఖరుసారి అయిదు రూపాయిలు, అది చూసి వాడానందంతో మైమరచేడు.

"ఆమె ఆలోచనల్నీ, మనస్సునీ వాడే యెప్పుడూ ఆక్రమించి కూర్చునీవాడు. వాడికూ్కడా యిది అలవాటయింది. దీన్ని చూడగానే పరుగెత్తుకొని వస్తూంటే యీామె హృదయం ఆనందంతో గంతులేసీది.

"తరువాత వాడు కనపడలేదు. జాగ్రత్తగా భోగట్టాచేసి, పై స్కూలుకి వెళ్ళేడని తెలుసుగుంది. చాలా నేర్పుతోటి, తమప్రయాణాల్ని మార్చి, సెలవుల కాపూరు వచ్చేలా, తల్లిదండ్రుల్ని ఒప్పించింది. ఆప్రయత్నంలో ఓసంవత్సరం గడచి పోయింది. ఆవిధంగా అతడు కనపడి, రెండేళ్ళు దాటిపోయింది. అతడ్ని చూస్తే యీామె గుర్తుపట్టలేనంతగా మారిపోయేడు. బాగా పొడుగయాడు. ఆబంగారు బొత్తాల కోటులో చాలా బాగున్నాడు. వాడీమెని చూడనట్టు నటించి, ముఖం ప్రక్కకి తిప్పుకుని వెళ్ళిపోయేడు. దాంతో ఆమె, రెండు రోజు లేడిచింది. ఎప్పుడూ అంతంకాని ఆమె బాధల కదే మొదలు."

"ప్రతివత్సరమూ, వచ్చేది. వీధిలో అతడు కనపడ్డపుడు పలక

రించడానికి ధైర్యం చేసేదికాదు. అత డీమె నెరగనట్టే పోయీవాడు. అదామె హృదయాన్ని రంపపుకోతలా బాధ పెట్టేది.

"డాక్టరుగారూ" ఆమె నాతో అంది "అత డొక్కడే నాచూపుల్లో బ్రతికివున్న పురుషుడు. మిగలావాళ్ళు, జీవిస్తున్నారో లేదో కూడా నాకు తెలియదు."

"ఆమె, తల్లి దండ్రులు చనిపోయాక ఆవృత్తే సాగిస్తూ వుండేది ఇప్పుడు రెండు కుక్కల్ని పెంచడం మొదలిడింది. ఆకుక్కలు రెండూ, చాలా భయంకరంగా వుండి ఆమెని రక్షిస్తూ వుండేవి.

"ఒకనాడు ఆవూ రొచ్చినపుడు, చోకెట్ భుజంమీద ఆనుకుని వాళ్ళింట్లో కెడుతూన్న ఒక యువతిని చూసింది. చోకెట్‌కి పెళ్ళి అయింది.

"ఆసాయంకాలమే, టౌనుహాలు ప్రక్కనున్న చెరువులో దూకింది చనిపోడానికి. కాని అప్రక్కగా పోతూన్న వాడెవడో యీమెని బయటికి తీసి, చోకెట్ దగ్గరకు తీసుకొచ్చేడు. ప్రథమ చికిత్సకోసం."

"అత డీమె నేమీ గుర్తించనట్టుగానే, అపిల్ల గుడ్డలు తీసేసి, వూపిరి వచ్చే వుపాయం చేసి, ఆమెకి తెలివి వొచ్చేక, "నీకేం మతి పోయిందా ఏమిటి చెర్లో వురకడానికి?" అన్నాడు.

"అదే చాలు ఆమె జీవితానికి. అత డామెతో మాట్లాడేడు. ఆ ఆలోచనే, ఆమెని చాలాకాలం వరకు సంతోషంగా వుంచింది. ఒనకి చేసిన వుపకారానికి డబ్బు తీసుకోమని ఎంత వత్తిడిచేసినా, అతడేం పుచ్చుగోలేదు."

"ఆవిధంగా ఆమె జీవితం గడచి పోతూంది. ఆమె కుర్చీలు బాగుచేస్తున్నపుడుకూడా అతన్ని గురించే ఆలోచిస్తూ వుండేది. ప్రతి సంవత్సరం, ఆ గాజుతలుపుల్లోంచి అతన్ని చూస్తూండేది. ఏవో చిన్న చిన్న చిట్కాలు కొంటూ, అతనితో మాట్లాడుతూ, చిన్నప్పటిరోజుల్లో లాగే ఆనందిస్తూండేది."

"ఆమె మొన్నే మూడునెలల క్రితం చనిపోయింది. తన విచార కర జీవితగాధంతా చెప్పేక, తనకున్నది చోకెట్ కే యివ్వమంది—ఆమె జీవితమంతా, అతని కోసమే పనిచేసింది. భోజనంకూడా ఒక్కొక్క సారి మానేసి అతనికోసం కూడబెట్టేది. ఆమె నాచేతికి రెండువేల మూడువందల యిరవైయేడు రూపాయ లిచ్చింది. ఆపైనున్న యిరవై యేడు రూపాయిలూ సమాధిఖర్చులకి పురోహితుడిచేతి కిచ్చేను. మిగతా యిరవై మూడువందలూ ఆమె చనిపోగానె నేను తీసుకొని వెళ్ళి పోయేను."

"ఆమర్నాడే చోకెట్ ని చూడ్డానికి వెళ్లేను. జీవితంలో సుఖపడ్డ వాళ్ళందరిలాగే, ఆనందంగా భోంచేస్తూ భార్యా భర్తా ఎదురెదురుగా కుర్చీల్లో కూచుని వున్నారు. నన్నాహ్వానించి, నాకూ—డా, పానీయ మిచ్చేరు. గద్గదికంగావున్న గొంతుకతో ఆమె కథ మొదలెట్టేను, వాళ్ళ హృదయాల్ని కరిగిద్దామనే ఆశతో."

"దేశాలు తిరిగే ఆమేదరి తన్ను ప్రేమించిం దనగానే, అదిరి పడి లేచేడు చోకెట్ కోపంతో. ఆమె తననుంచి గౌరవం, మర్యాదా, తన కులీనతా, నాగరికతా, దొంగిలించేసినట్టు భావించే డనుకుంటాను. అతని భార్యకూడా, విసుగుతో ఏం మాట్లాడలేకపోయింది."

"ఆముసలి ముష్టిదా? ఆముసలి ముష్టిదా?" అని మాత్రం పరధ్యా నంగా అన్నట్లు అంది."

"చోకెట్ కోపంతో బల్లమీదగుద్దుతూ "డాక్టరుగారూ! అటువంటి సంగ తెప్పుడేనా విన్నారామీరు. వెధవపని చేసింది. అది బతికుండగా కనక నాకు తెలిస్తే వెధవముండని జైలుకు పంపించే వాడిని. అప్పుడు దానిప్రేమ ఏమిటో తెలిసేది."

"నేను చేద్దామనుకున్న దాని ఫలితం చూసి నిర్ఘాంతపోయేను. కాని నావిధి నే నెరవేర్చాలిగా. మళ్ళీ అన్నాను."

"ఆమె జీవితంలో కూడబెట్టిన యిరవైమూడువందలూ మీకు యిమ్మంది. కాని ఆమె కథ మీకు అసహ్యంగా వుంది కనుక ఆడబ్బు బీదలకే పంచిపెడితే మంచిదేమో."

"నోట మాటలేకుండా వాళ్ళిద్దరూ నాకేసి తేరిపారచూసేరు. అనేక దేశాల వెండి, బంగారు నాణేలతో వున్న సంచీ వాళ్ళముందు కుమ్మరించేను."

"ఏం చెయ్యడంకి నిశ్చయించేరు?" అన్నాను. ఆయన భార్య ముందు మాట్లాడింది.

"అది దాని కడపటి కోరిక-కనక-తిరస్కరించడమెట్లా"? అంది.

"అసౌమ్మ, పిల్లలకోసమే ఖర్చుపెడతాము." అన్నా డాతడు సిగ్గులేకుండానే.

"మీయిష్టం వచ్చినట్టు చేసుకోండి" అన్నాను నేను అసహ్యంతో.

"సరే, అది మిమ్మల్ని కోరింది కనుక మేం పుచ్చుకుని మంచి కార్యాలకే వినియోగిస్తాం" అన్నాడు.

నేను డబ్బు యిచ్చేసి వెళ్ళిపోయేను. మర్నాడు చోకెట్ కని పించి, "అది వొదిలేసి పోయిన బండి....మీరేం చేద్దామకుంటున్నారు?" అన్నాడు.

"కావలిస్తే తీసుగోండి" అన్నాను.

"అబ్బే! దొడ్లో షెడ్డుకింద బాగా వుంటుందేమోనని" అన్నాడు.

"ఆవిడ ఓముసలి గుర్రం రెండు కుక్కలూ కూడా వదలేసింది మీక్కావాలా ఏమిటి?" అన్నాను.

కాస్సేపు ఆలోచించి, "అబ్బే, వద్దు! అవి నాకెందుకు పని కొస్తాయి. వాటిని మీయిష్టం వచ్చినట్టు చేసుకోండి" అన్నాడు.

సిగ్గులేని, నవ్వోటి నవ్వి వెళ్ళిపోయేడు.

"ఆకుకక్కల్ని నేను పెంచుతున్నాను. పురోహితుడు తన పెద్ద దొడ్డిలో గుర్రాన్ని మేపుతున్నాడు. చోకెట్ ఆబండిని షెడ్డుగామార్చేడు. ఆమె యిచ్చిన డబ్బుతో రైల్వే కంపెనీలో షేర్లు కొన్నాడు."

"అదొక్కటే, నేచూసిన విన్న స్వచ్ఛమైన ప్రేమ వృత్తాంతం." అని డాక్టరు, తన కథ పూర్తిచేసేసి నిశ్శబ్దంలో మునిగిపోయేడు.

యువతులంతా కన్నీళ్ళతో నిట్టూర్చేరు. వారిలో ఒకామె అంది "మావాదమే నెగ్గింది. నిజంగా ప్రేమించగలది, స్త్రీ మాత్రమే."



# ముద్దు

## చెకోవ్

అది మే నెల యిరవయ్యోతేదీ. సాయంత్రం ఎనిమిది గంటలు కావచ్చింది. "యు" రిజర్వు ఫిరంగిదళం తాలూకు ఆరు బేటరీలు ఆరాత్రికి 'మిస్టిచోర్కి' గ్రామంలో మకాం చేయ నిశ్చయించేయి. దళం విడిసినచోట అంతా గోలా, గందరగోళంగా వుంది. ఫిరంగుల్ని నిర్దిష్ట స్థానాల్లో పెట్టి, టార్పాలిన్‌లు (తారుగుడ్డలు) కప్పుతూన్నారు. క్వార్టర్-మాస్టర్లు యిచ్చే ఉత్తరవులు వింటూ అక్కడక్కడ గుంపుగుంపులుగా నిలబడివున్నారు, సోల్జర్లు. చాలమంది ఒక్కమాటుగా మాట్లాడ్డం వల్ల అంతా గందరగోళంగా వుండి హడావుడిగా అటునిటు పరుగెత్తుతూన్నారు, ఆర్డర్లీలు. ఇట్లాంటి సమయంలోనే పౌరదుస్తుల్లో వున్న అశ్వికుడొకడు చెర్చి వెనకనుంచి స్వారీచేస్తూ ఊడిపడ్డట్టుగా వచ్చేడు. అతని యెర్రగుర్రం చిన్నదైనా చాల తమాషాగా వుంది, మెడ మాంచి ఠీవిగా వంచి, కత్తిరించిన తోక ఆడిస్తూ, యెవరో కాళ్ళమీద కొరడాతో కొడుతున్నట్లు చెంగుచెంగున దూకుతూ పరుగెత్తుతూంది. సూటిగా పోక అడ్డంగా పీతలా నడుస్తూంది. అశ్వికుడు ఆఫీసర్లు చాలామంది గుంపుగా వున్నచోటికి వచ్చి గుర్రాన్ని నిలిపి, వందనపూర్వకంగా టోపీని, చేత్తో యెత్తి పట్టుకున్నాడు :

"వందనాలు! హిజ్ఎక్సలెన్సీ జనరల్ వాన్‌రచ్బెన్ దొరవారు తామందరినీ తేనీటివిందుకి దయచేయమని కోరుతున్నారు!"

అంటూండగనే అతని గుర్రం ప్రక్కవాటుగా వెనక్కి త్రుళ్ళింది. 'సెలవు!' అన్నట్లు టోపీ పైకెత్తి పట్టుకుని, అశ్వికుడు తిరిగి చెర్చివెనక్కాల మాయమై పోయేడు.

రోజంతా ప్రయాణంచేసి, అలిసిపోయి, రాత్రి సుఖంగా పడుకో వచ్చుగదా అని తయారవుతూన్న ఆఫీసర్లు సణగటం ప్రారంభించేరు.

"దీన్నీ తగలెయ్యా, విందేమిటోయ్!"

"ఒళ్ళు హూనమైపోయి ఒక్క కునుకు తీద్దామనుకుంటూంటే, వీడెవడోయ్, సైంధవుడిలా తయారయేడు!"

"ఎవడోయ్! ఈవాన్‌రబ్బెక్!"

"చస్తూంటే, తేనీటివిందని పట్టుకున్నాడేమిట్రా, బాబూ!"

"ఎవడెరగడోయ్, వీళ్ళ విందులు!"

వాళ్ళల్లో ఒక్కడూ మరిచిపోలేదు, నిరుడుజరిగిన విందు; అప్పుడు సైన్యవిన్యాసాలు జరుగుతున్నాయి. ఓ కోసక్కుపటాలపు ఆఫీసర్లూ, తామూ కలిసి యీమాదిరిగానే ఆహ్వానితులై ఓ ఊళ్ళో జమీందారు యింటికి విందుకి బోయేరు. ఆతడూ రిటైరైన ఆఫీసరేనట! చాల మర్యాదచేసి, ఆరాత్రికి తనయింట్లో కాలక్షేపం చెయ్యాలిసిందని ఆహ్వానించేడు. అంతా బాగానే వుంది. దివ్యమైన విందు! ఇంకా కావలసిందేమిటి? ఇంతకీ వచ్చిన చిక్కేమిటంటారా? ఆవృద్ధుడు, యీపడుచు కుర్రాళ్ళతో కలిసేసరికి మహాహుషారెక్కిపోయేడో యేమిటో, యింక వెనకటి కధంతా యేకరువుపెట్ట నారంభించేడు. ఎంతకీ వదలి పెట్టందే! ఈ కుర్రగాళ్ళే మనడానికీ వీలే లేకపోయింది. పోయి ఓక్షణం నడ్డి వాలుద్దాం అనే కోరిక లోపలే అణచుకోవాల్సి వచ్చింది. ముఖాలికి చేతులడ్డం పెట్టుకుని, మెల్లిగా ఆవులిస్తూ, మహాఅవస్థ పడిపోయేరంటే నమ్మండి! ఓగదిలోంచి మరోదాంట్లోకి యీడ్చుకుపోతూ, పేరు పేరు వరసన, తాను పోగుచేసిన గొప్ప చిత్రాలూ, ప్రాచీన చెక్కడపు బొమ్మలూ, చిత్రవిచిత్రమునైన కవచఖడ్గాది ఆయుధసామగ్రీ; ఒకటేమిటి, చివరకి తనకెవరెవరో పెద్దపెద్దవాళ్ళు రాసిన ఉత్తరాలు సహా చూపించి, వాట్లని గూర్చి తెగచెప్పి, తన దీర్ఘజీవితంలో గడిచిపోయిన

సుఖమయఘట్టాలెన్నో వినేవాళ్ళకి విసుగ్గా వుంటుందేమోననేనా వదల కుండా యేకరువుపెట్టి, చివరకి తెల్లవారుతుందనగా వదలిపెట్టేడు! అప్పుడింక నిద్రేమిటి, నిప్పులు! తమనిస్సహాయతకూ, యీబలవంతపు మర్యాదకూ యేడుపూ, నవ్వూ కూడా వచ్చేయి.

ఈ 'వాన్‌రబ్బెక్' కూడా అటువంటివా డింకొకడు కాడుగదా? ఏమైనా యిప్పుడింక చేయగలిగిం దేముందిలెండి. ఆఫీసర్లంతా ఒళ్లు కడుక్కొని, మంచిదుస్తు లేసుకుని, జమీందారు హవేళీ వెతుక్కుంటూ బైలుదేరేరు. చెర్చిదగ్గర అడిగితే చెప్పేరు. "అదిగదుగో! చెర్చివెనకా లున్న అడ్డుత్రోవను బోయి, నది వెంబడే కాలిబాటను పోతే జమీందారు తోట కనిపిస్తుంది. రెండు ప్రక్కలా చెట్లవరుసలతో దారి తెలుస్తూనే వుంటుంది. ఆదారి తిన్నగా వాకిలి దగ్గిరికి తీసికొని బోతుంది. లేదా రోడ్డే పోయినాసరే. పావుమైలు పోతే పెద్ద బేరన్‌లు కనిపిస్తాయి. అక్కడ మలుపు తిరిగితే హవేళీ కనిపిస్తూనే వుంటుంది." రోడ్డుదారినే బోవడానికి నిశ్చయించుకుని బైలుదేరేరు. 'చుట్టుఅయినా మెట్టమేలు' కదూ!

"ఎవరోయ్ యీ వాన్‌రబ్బెక్?" దారిపొడుగునా యెవరో ఒకరు ప్రశ్నవేస్తూనే వున్నారు. "ప్లెవ్నాయుద్ధంలో 'యు' ఫిరంగిదళాన్ని కమాండుచేసినవాడు కాదుగదా, కొంపదీసి?"

"అబ్బే! అతనికి తోకలేందే! అతడు వాన్‌రబ్బెక్‌గాదు. ఉత్త్తి 'రబ్బె' వాన్ గీన్ లేదు."

"ఈరాత్రి చాలా బాగుంది సుమీ!"

బేరన్లదగ్గర రోడ్డు రెండుగా చీలింది. ఓరోడ్డు సరాసరే పోయి, చీకట్లో కలిసిపోయింది. కుడివైపుతిరిగిన రోడ్డు జమీందారు యింటికి పోయింది. ఆమలుపు తిరిగేక వీళ్ళంతా బిగ్గరగా మాట్లాడ్డం మానేసేరు. వారికి రెండు ప్రక్కలా బేరనులు వరుసలు దీరి వున్నాయి. అవన్నీ

దిట్టమైన రాతికట్టడాలే. పైకప్పుకి యెర్రటిరంగు వేసేరు. కొత్తవాళ్ళు చూస్తే యివేవో పటాలాలుండే బారకీసులనుకుంటారు కూడాను.

"మంచి శకునమే! చూడండి, మన వేటగాడు హుషార్‌గా పోతూన్నాడు. ఏదో యెరని పసికట్టినట్లే వుంది!" అన్నాడు, ఓ ఆఫీసరు ముందుకి చూపుతూ.

లెఫ్టినెంటు లోబితో అందరకూ ముందు నడుస్తున్నాడు. ఒడ్డూ పొడుగూగల విగ్రహం. ముఖం గుండ్రంగానూ, మాంసలంగానూ వుంది. మీసం తీసేసేడు. వయస్సెంతో చెప్పడంకష్టమేగాని, పాతికేళ్ళకి తక్కువుండదు. దూరాన్నుంచే ఆడవాళ్ల వునికిని కనిపెట్ట గలవాడనే ఖ్యాతి సంపాదించుకున్నారు. స్త్రీలంటే చెవి కోసుకుంటాడు.

ఆమాటలు వినడంతోటే చటుక్కున వెనకతిరిగి, "ఔను. యిక్కడ స్త్రీ లున్నారోయ్. నాకట్లా అనిపిస్తూంది," అన్నాడు.

హవేలీముందు ద్వారం దగ్గరే గృహస్థు మమ్మల్ని కలుసుకుని ఆహ్వానించేడు. వయస్సు అరవై దాటినా, ఆ జనరల్ పౌరదుస్తుల్లో అంద గాడుగానే చలామణీ అయేటట్లున్నాడు. అందరితోనూ కరస్పర్శచేస్తూ, సంతోషం వెలిబుచ్చి. ఆ రాత్రంతా అక్కడే బస యివ్వజాలనందుకు క్షమాపణ చెప్పి. చాలా నొచ్చుకుంటూ మాట్లాడేడు. "ఎంత యిల్లుంటే నేం. ఒక్క గదికూడా ఖాళీ లేకపోయిందండీ. నాచెల్లెళ్ళిద్దరూ పిల్లలతో సహా వచ్చేరు. నాతమ్ముళ్ళూ యీసమయంలోనే వచ్చేరు. పైగా కొందరు స్నేహితులు. మీకు ఒక గదికూడా యివ్వలేకపోయినందుకు చాలా యిదిగా వుందండీ!"

వాన్, చాలా మర్యాదస్థుడుగా కనిపించేడు. అతని ముఖం చూస్తేనే గత సంవత్సరం మాకాతిధ్యమిచ్చిన జమీందారువంటివాడు మాత్రం కాదని తెలిసిపోతుంది. అతిధుల్ని చూస్తే ఆ మానవుడు పొందిన మహదానందం యితనిలో యేకోశాన్నీ కనిపించడం లేదు. ఈయనలో

కేవల మర్యాదా, లాంఛనం,—యివే కనిపిస్తాయి. జమీందారు వెన క్కాలే మాట్లాడుతూ, తివాచీలు పరచివున్న మేడమెట్లు యెక్కు తూన్నాం. మెట్లమీదా, హాల్లోనూ దీపాలు వెలిగించడానికి తొందర పడుతూన్నాడు, నౌకరు. పరిస్థితులు చూస్తే మేమక్కడి కెందుకు వచ్చేమా అనిపించేటట్లున్నాయి. ఈయింటికి ప్రస్తుతం యిద్దరు చెల్లెళ్లూ, వాళ్ళ పిల్లాజెల్లా, తమ్ముళ్ళూ, మరికొందరు స్నేహితులూ వచ్చి విడిసి వున్నారాయె. అట్లాటి అసమయంలో ముక్కూ మొహం తెలియని పరాయి మగాళ్ళు,—ఒకడూ యిద్దరూ కాదు, పంథొమ్మండుగురాయె!,- వేంచేసి, పీకలమీద కూర్చుంటే ఏమి సుఖంగా వుంటుందో మీరే చెప్పండి!

హాలుముందే నిలబడి గృహిణి మమ్మాహ్వానించింది. వయస్సు ఏభై యోపదిలో పడినా ఆమెలో గాంభీర్యానికేమీ కొదువలేదు. ఆమెది కోలముఖం, కనుబొమలు నలుపు; యూజి నీరాజ్ఞికీ యీ మెకీ చాలపోలిక వుంది. మర్యాదాసూచకమైన చిరునవ్వుతో ఆహ్వానించి, ఆరాత్రికి విడిది యేర్పాటు చేయజాలనందుకు క్షమార్పణ కోరింది పీరినిలోనికి పంపే, వరకే ఆమె ముఖం మీద చిరునవ్వు వెలుగు! మేము వెనకతిరిగిన మరుక్షణమే ఆమె ముఖంలో చిరునవ్వు మాయం కావడాన్నిబట్టి ఒకటి మాత్రం నిశ్చయంగా చెప్పగలం. ఆమె తనకాలంలో యిట్లాంటివాళ్ళ నెందరినో యెరుగును; ప్రస్తుతం వీళ్ళ ప్రయోజన మామె కేమీలేదు; తన హోదా, పరువుప్రతిష్ఠలూ నిలబెట్టుకోడానికే, విధిలేక యిప్పుడీ మందనంతనూ ఆహ్వానించింది!

మేము హాలులో ప్రవేశించే టప్పటికే ఆడా మగా, చిన్నా పెద్దా, అంతా ఓడజనుమంది జనం టేబిల్‌దగ్గర కూర్చుని 'టీ' సేవిస్తూన్నారు. వాళ్ళ వెనక ఓగుంపు మగాళ్ళు ఊరిఖే సిగరెట్లు ఊదిపారేస్తూ, కృత్రిమ మేఘాల్ని కల్పిస్తూ, నిల్చుని బాతాఖానీ కొడుతున్నారు. ఎర్రటి పొసకట్టు

గల పల్చని యువకుడొకడు వాళ్ళ మధ్యలోనే బిగ్గరగా యింగ్లీషులో యేదో దంచేస్తున్నాడు. ఆవలివైపు ద్వారంలోంచి చూస్తే ఓపెద్దగది కనిపిస్తుంది. మేఘవర్ణపు ఫర్నిచర్ ఆగదిలోని వెలుతురులో దేదీప్య మానంగా మెరిసిపోతూంది.

హాలులోకివెళ్ళి నిలుచున్నాం. గృహస్థు గంభీరంగా లేచి నిల్చుని, బిగ్గరగా అన్నాడు :

"అయ్యా! తామందర్నీ వేరువేరుగా పరిచయం చేయడం సాధ్యం కాదు. అందుచేత, దయచేసి ఒక్కొక్కరే తమ పరిచయం చెప్తే బాగా వుంటుంది."

కొందరు గంభీరంగానూ, మరికొందరు చిరునవ్వుతోనూ,— అందరూ యేదో యెబ్బెట్టుగానే లెండి, కానైతే,—తమతమ పరిచయం చెప్పుకుని. వంగి నమస్కరించి, ఒక్కొక్కరే కుర్చీలమీద కూచున్నాం. అందరిలోకీ మరీ బాధపడ్డవాడు స్టాఫ్ ఆఫీసర్ రియాబోవిష్. కళ్ళ జోడూ, గుండ్రని దిగుభుజాలూ, చిన్నవిగ్రహం; యిదీ అతని స్వరూప వర్ణన.

తోడివాళ్లు కొందరు గాంభీర్యాన్నీ, కొందరు చిరునవ్వునూ తెచ్చి పెట్టుకుంటే, రియాబోవిష్ ముఖం వెలుతురులోకి వచ్చిన మానుపిల్లి ముఖంలా పెట్టేడు. కళ్ళజోడూ, ముక్కుక్రింద అంటించునట్లున్న చిన్నమీసం,—అచ్చంగా మానుపిల్లే!

"మావాళ్ళందరిలోకీ యెక్కువ బిడియపడేవాణ్ణీ, పిరికివాణ్ణీ, స్థాణు స్వరూపుణ్ణీ నేనేసుమా!" అంటూన్నట్లుగా వుందాతని వైఖరి. హాల్లోకి ప్రవేశించి, టేబిల్‌దగ్గర కూర్చున్న చాలసేపటివరకూ అతడు దేన్నీ చూడలేక పోయేడు. ఎన్నో ముఖాలు, రంగురంగుల దుస్తులు, సారా గ్లాసులు, టీ కప్పులు, కప్పుల్లోంచి వస్తూన్న ఆవిరి, గోడనూ, స్థంభాల మీదావున్న సున్నపుదరుజుమీది లతలూ,—అన్నీ కలిసిపోయి, అతని

మనస్సుని కంగారుపెట్టి, కళ్లెత్తి చూడనీయకుండా చేసేయి. మొదటి సారి ఉపన్యాసమీయబోయే వానివలె అతను అన్నీ చూస్తున్నా, దేన్నీ గుర్తించలేకున్నాడు. తపోసాధ్యమైన 'శూన్యదృష్టి' యిట్టే లభించింది! కొంచెం సేపటిలోనే పరిసరాలకి మెల్లిగా అలవాటుపడి, రియాబోవిష్ తెప్పరిల్లుకుని చుట్టూ పరికించనారంభించేడు. అతనెప్పుడూ యిటువంటి సభ్యసమాజంలో మసలినవాడు కానేకాదు. అందువల్ల రబ్బెక్, అతనిభార్య, మరోయిద్దరు ప్రౌఢస్త్రీలు, ఊదాగౌను తొడిగిన యువతి, ఎర్రటి మీసాల యువకు డొకడూ,—యితడు రబ్బెక్ కనిష్ఠ పుత్రుడే,—వీళ్ళంతా తరిఫీదై, అంతా కూడబలుక్కుని వచ్చినట్లు, అంతా తలోచోటా అతిథులమధ్యకి వచ్చి కూర్చుని, అతినేర్పుగా తమరి నందర్నీ సంభాషణలోకి దించడం చూస్తే, అతనికి చాల ఆశ్చర్యం కలిగింది! ఏం చేయలేకా, గత్యంతరంలేకా వీళ్లూ మాట్లాడుతూన్నారు. టేబిల్ మీదుగా యిరుపక్షాలకీ మాంచి బిగిమీద జరుగుతూంది తర్కం. విషయం యేమిటో తెలుసా? ఆశ్విక, కాల్బలాల్లోకంటె ఫిరంగిదళంలో జీవితం అధిక సుఖకరంగానూ, స్వేచ్ఛగానూ వుంటుంది. ఊదాగౌను; జనరల్ రబ్బెక్, మరోప్రౌఢతరుణీ అట్లా గాదంటారు! ఆచర్చనీయాంశాన్ని గురించి ఊదాగౌనుకి అనుభవమూలేదు, అభినివేశం ఏమిటో కూడా చెప్పలేము. ముఖంమీద తెచ్చి పెట్టుకున్నదే అనండి,—చిరునవ్వు చిందులాడుతూంటే, ఆమె ఊరిఖే యుక్తి ప్రయుక్తులు చెపుతూంటే, రియాబోవిష్ ఆశ్చర్యంతో నోరు తెరుచుకుని చూస్తున్నాడామెను.

జనరల్, అతనిభార్యా అతి చాతుర్యంగా ఆఫీసర్లనందరినీ యీ చర్చలోకి యీడ్చేరు. అంతేగాదు. అందరూ తింటున్నారా? త్రాగుతూన్నారా? లేదా అని వాళ్ళప్లేట్లు, గ్లాసులుమీద ఓకన్నువేసి జాగ్రత్తగా చూస్తూనే వున్నారు. ఇదంతా చూస్తూన్నకొద్దీ కుహనాసంస్కారులైనా

సుశిక్షితులుగా కనిపిస్తూన్న యీకుటుంబం అంటే రియాబోవిష్‌కి గౌరవం యేర్పడి పోయింది.

టీ త్రాగడం అయిన తర్వాత అందరూ కచేరీహాల్లోకి చేరు కున్నారు. లెఫ్టినెంటు లోబిత్కో అంచనా అబద్ధం అవుతుందా? అక్కడ చాలమంది స్త్రీలు, వివిధవయస్సుల్లో వాళ్ళు చేరి, కోలాహలంగా వున్నారు. ఏమీ సంకోచం లేకుండానే లెఫ్టినెంట్ లోబిత్కో నల్ల గౌనులోవున్న ఓచక్కని పడుచుదగ్గిరికి చేరి, బహుశ్రద్ధగా ఆమెవైపు వంగి బాతాఖానీ ప్రారంభించేడు. భుజా లూరిఖే కుదుపుకుంటూ, చిరు నవ్వులు ఒలకబోస్తూ, ఏదో బాతాఖానీ కొడుతూంటే, ఆమె తెచ్చిపెట్టు కున్న ఆసక్తితో వింటున్నట్టు నటిస్తూంది. బూరెలాంటి అతని ముఖం వైపు అనుగ్రహసూచకంగా చూస్తూ, పరధ్యాన్నంగా అడుగుతూంది: "నిజంగానే?" ఆమె ఉదాసీనత అంతా ఆకంఠంలోనే తెలుస్తూంది. ఏమాత్రం తెలివైనవాడైనా ఆమె తనమాటలేం వినడంలేదని తెలుసుకో గలడు. కాని, అహం, అట్లా వదలితే యింకేముంది!

ఇంతలో యెవరో పియానో వాయించ నారంభించేరు. తెరిచి వున్న కిటికీల్లోంచి చక్కని గాలి వీస్తూంది. గులాబీ, లిలాక్, పోప్లార్ పుష్పాల సౌరభంతో మత్తెక్కిపోయిన మలయానిలుడు మందగతితో వున్నాడు. వాతావరణం బహురమ్యంగా, ఆహ్లాదకరంగా వుంది.

త్రాగిన ద్రాక్షాసవానికి సంగీతం తోడురాగా, రియాబోవిష్ కిటికీ మీదికి వ్రాలి వెర్రినవ్వులు నవ్వుతున్నాడు. యువతుల హావభావచేష్టల్ని తదేకదృష్టితో అవలోకిస్తూంటే, ఆ హాల్లోని సువాసనంతా బైటి గులాబీ, లిలాక్, పోప్లార్ పువ్వులనుంచి గాక రమణుల శరీరాలనుంచీ, దుస్తుల నుంచీ వస్తూందని అతనికి నిశ్చితాభిప్రాయం కలిగింది.

చూస్తూండగానే జనరల్ కుమారుడు సన్నని పొడుగంటి పిల్లని తీసికొని నాట్యం చేస్తూ, గదిచుట్టూ మూడు చక్కర్లు కొట్టేసేడు.

చల్లగా మెల్లగా జారివెళ్ళి ఊదాగౌను పిల్ల నడుంచుట్టూ చెయ్యేసి లాక్కొని, గిర్రున త్రిప్పుతూన్నాడు. లోబితో౯. నాట్యం ప్రారంభ మైంది............నాట్యం చేయని మగాళ్ళతోబాటు రియాబోవిష్‌కూడా ద్వారం దగ్గిరికి బోయి నిలబడ్డాడు. అతను తనజీవితకాలంలో ఒక్క సారికూడా డాన్సు చేసివుండలేదు. కేవలం అంతేనా. ఇప్పటిదాకా ఒక్క మాపైనా, మర్యాదగల కుటుంబానికి చెందిన స్త్రీని స్పృశించే అదృష్టం అతనికి కలగలేదంటే నమ్మండి! అపరిచితురాలై, మర్యాదగల ఓఅందమైన పడుచును, నడుముచుట్టూ చేయివేసి పొదివి పట్టుకుని, తన భుజాన్ని ఆమె బాహులతకు అవలంబనగా యిచ్చి నడుస్తూండే పురుషుని అదృష్టాన్ని ఊహించుకుంటూంటే, రియాబోవిష్ మనస్సు సంతోషంతో పొంగిపోయేది. కాని, ఎదీ, తనకంతటి అదృష్టమా. తనకూ, యెప్పటికైనా అంతటి అదృష్టం లభిస్తుదంనే ఆశ రవంతకూడా లేదా తనకి! తోటివాళ్ళ ధైర్యానికీ, సాహసానికీ తనకు అసూయకలిగిన రోజులూ వున్నాయి. తన దిక్కుమాలిన సిగ్గునీ, గుండ్రని దిగుభుజాల్ని, అందచందాలులేని తన ముఖసౌభాగ్యాన్నీ. ముక్కుక్రింది మీసాన్ని తలుచుకుంటూంటే అతని మనస్సు క్రుంగిపోయేది. క్రమంగా కాలం గడిచినకొద్దీ రియాబోవిష్ దీని కలవాటుపడిపోయేడు. డాన్సుచేస్తూన్న మిధునాల్ని, స్త్రీలతో నిర్భయంగా, హుషారుగా మాట్లాడే పురుషుల్ని చూస్తుంటే అతనిలో యిప్పుడు అసూయగాక కేవలం విచారమే కలుగుతూంది.

* క్వాడిల్లీ ప్రారంభం కాబోతూంటే జనరల్ కుమారుడు వీళ్ళ దగ్గిరికి వచ్చి, యిద్దరు ఆఫీసర్లను బిలియర్డ్స్ ఆడుకోడానికి రమ్మని ఆహ్వానించేడు. ముగ్గురూ కలిసి బైటికి వెళ్ళిపోతూంటే, రియాబోవిష్ వాళ్ళని వెంబడించేడు. తానూ ఏదో ఒకటిచెయ్యాలని వుంటుందామెను!

* నాలుగు మిధునాలు చతురస్రంగా నిలుచుని చేసే డ్యాన్సు.

పైగా యీఅట్టహాసంలో తానూ యేదోలాగ భాగస్వామి కావాలనేకోరిక పీకుతూంటుందికదూ? కచేరీహాలులోంచి పొడుగాటి సన్నని వసారాగది దాటి మరో గదిలోకి ప్రవేశించేరు. అక్కడ ఓబెంచీమీద కూర్చుని కునికిపాట్లు పడుతూన్న సేవకులు ముగ్గురూ వీళ్ళని చూసి, ఉలిక్కిపడి గభాలున లేచారు. వాళ్ళని చూడనట్టుగా ఆగదీ. మరో కొన్ని గదులూ దాటి బిలియర్డ్సుహాలులో ప్రవేశించేరు. ఆట ప్రారంభమైంది.

రియాబోవిష్ ఎప్పుడూ పేకతప్ప యింకే ఆటా ఆడలేదు. అంచేత ఉదాసీనతతో చూస్తూ నిల్చున్నాడు. ఆటగాళ్ళు కోట్లు విప్పేసి, కర్రలు చేత్తో పట్టుకుని ఊపుకుంటూ, వేళాకోళాలాడుతూ, ఏవో అర్థంగాని మాట లుచ్చరిస్తూ, అటూ యిటూ మారుతూ, బిలియర్డ్సు ఆటలో నిమగ్నులై పోయేరు. ఏమో చేతిపోటో, కర్రపోటో తలిగినపుడు "క్షమించు" అని లాంఛనంగా అనటం తప్ప, రియాబోవిష్ అక్కడున్నట్టే వాళ్లు భావిస్తున్నట్లులేదు. ఒక ఆట అయేటప్పటికే అతనికి ప్రాణం విసిగింది. తన అవసరం అక్కడేమీలేదు. పైగా తాను అడ్డుగా వున్నట్లుకూడ గుర్తించి, వెళ్ళిపోదా మనిపించింది, రియాబోవిష్‌కి.

పోతూండగానే దారిలో ఓచిన్న విశేషం జరిగింది. కొంతదూరం వెళ్లేక తాను దారితప్పినట్లు గుర్తించేడు. కునికిపాట్లు పడే ముగ్గురు నౌకర్లున్న గదిలోంచి వెళ్లాల్సివుందని అతనికి జ్ఞాపకం. ఇప్పటికి ఆరు గదులు దాటినా, వాళ్ళు కనిపించలేదు. పొరబాటు తెలుసుకుని, వెనక్కి వెళ్ళి, కుడిచేతిమీదుగా తిరిగి, ఓగదిలో ప్రవేశించేడు. అందులో దీపం మసకగా వుంది. ఈగదిని తానావరకు చూసినట్లులేదు. ఒక్కక్షణం నిల్చునిపోయి, ఏదో నిశ్చయాని కొచ్చినట్లు చేతికొచ్చిన మొదటితలుపు తెరిచేడు. లోపల చీకటిగా వుంది. తలుపు కంతలోంచి ఆవల మంచి ప్రకాశమానంగా దీపపువెలుగు కనబడుతూంది, ఓప్రక్క సంగీతాలాపనా ధ్వని తెరిచివున్న కిటికీల్లోంచి బాగా వినిపిస్తూంది. ఇక్కడా గులాబీ, లిలాక్, ఫ్లోక్స్ పుష్పాల సువాసనతో గదంతా నిండింది.

ఏంచేయాలో తోచనట్లు రియాబోవిష్ ఒక్కక్షణం ప్రాన్పడి నిలుచుండిపోయేడు. అంతలోనే యెవరో తొందరగావస్తున్న పాదధ్వని, యిస్త్రీచేసిన దుస్తుల పెళపెళధ్వని వినిపించేయి. ఉద్రేకంతో అణిచిపెట్ట బడినట్లున్న స్వరంతో "అమ్మయ్యా, చివరకి!" అంటూ ఒక స్త్రీ కంఠం; సుగంధాన్ని విరజిమ్ముతూ రెండు మెత్తని బాహువులు,— ఏం సందేహంలేదు అవి యువతి వనడానికి,—అతని కంఠాన్ని కౌగ లించుకున్నాయి; నునుపెచ్చని చెక్కిలి అతని చెంపను హత్తుకొంది! 'ప్చ్' ముద్దుకూడా పెట్టుకుంది! ఏదీ? చెప్పడాని కింతసేపుగాని అంతా రెప్పపాటులో జరిగిపోయింది. ఆపరక్షణంలోనే అసహ్యంగా విదిలించు కుంటూ, సన్నని కేకవేసి, భయవిహ్వాలయై పారిపోయిన అలికిడి! అంతా ఒక్క క్షణంలో. రియాబోవిష్ కంఠంలోంచికూడా యేదో కేక రాబోయే, అణిగిపోయింది. వెలుతురు కనిపించేవైపు తలుపులు తెరుచు కుని యివతల బడ్డాడు.

డాన్సుహాలు ప్రవేశించినా అతని గుండెలు దడదడ, చేతుల వణకు తగ్గలేదు. ఎవరేనా చూస్తారేమోనని చటుక్కున రెండు చేతులూ వీపు వెనక్కి పెట్టుకున్నాడు. అతనిలో కలిగిన భావాలు మొదటిది భయం, రెండోది సిగ్గూ. ఎవరేనా చూసేరేమో? ఇప్పుడే ఎవరో స్త్రీ తన్ను కౌగలించుకుని ముద్దెట్టుకుందని వీళ్ళందరికీ తెలుసు ననుకున్నాడు. కాని, అందరూ యధాపూర్వంగానే డాన్సు చేస్తున్నారు, బాతాఖానీ కొడుతున్నారు. అమ్మయ్య! అతనిప్రాణం కుదుటబడింది. ధైర్యం కలిగింది. భయం వదలిపోడంతోనే సంతోషం ఉక్కిరి బిక్కిరి చేస్తున్నట్లు తెలిసికోగలిగేడు. తన జీవితంలో మొట్ట మొదటిసారిగా కలిగిన యీ సౌఖ్యానుభూతి అతని నరనరాల్నీ కదిలించి వేస్తూంటే 'పోనీలే' అని ఊరుకోక తప్పిందికాదు. చాల విచిత్రమైన సంఘటనే!........ఆ రెండు సుకుమారహస్తాలూ కౌగలించుకొన్న అతని

మెడచుట్టూ ఏదోసుగంధతైలం పూయబడ్డట్టుగా సుఖంగా వుంది; చెంప మీద, ఎడమచెవిక్రింద ముద్దుపెట్టుకున్నచోట చల్లగా పచ్చకర్పూరం అలదినట్లుగా వుంది! ఎన్నిసార్లు తుడిచినా చల్లదనం, సుఖస్పర్శ హెచ్చుతూందేగాని తగ్గడంలేదు. ఆపాదశిరఃపర్యంతం యేదో నూతన జీవనవ్యక్తి, ఉత్సాహం చొరబారి, నిండి పొర్లిపోతూన్నట్లుగా వుంది! ........అతనికి యిప్పుడు డాన్సు చేయాలనీ, యేదో మాట్లాడాలనీ, నవ్వాలనీ వుంది....తను దిగుభుజాలవాణ్ణనీ, అందవిహీనుణ్ణనీ మరిచే పోయేడు. "రియాబో ఎందునా పొందనివాడే" అని (తనను యెరిగిన స్త్రీ ఒకతె మరొక స్త్రీతో చెపుతూంటే యితడు చాటునవుండి వినడం తటస్థించింది లేండి!) కూడా యిప్పుడతను మరిచి పోయేడు! జనరల్ భార్య ఆమార్గాన్ని వెదుతూంటే మొహం చేటంత చేసుకుని, పలక రింపుగా నవ్వేడు. "అనుగ్రహించేనులే" అన్నభావం ఆనవ్వులో ద్యోతకమవుతూంది, ఆమె చాల ఆశ్చర్యం కలిగి, అట్లాగే నిలబడి పోయింది!

"మీయిల్లు చాలా బాగుందండీ!" అన్నాడు, కళ్ళజోడు సవరించు కుంటూ.

గృహిణి చిరునవ్వుతో ఆభవంతి తన పిత్రీయమని చెప్పింది. తల్లిదండ్రులు బాగా వున్నారా? పటాలంలో యెంతకాలాన్నుంచి పని చేస్తున్నారు? అంత సన్నగా వున్నారేమి? అంటూ సద్భావసూచకంగా ప్రశ్నిస్తూ సంభాషణ ప్రారంభించి,........కాస్సేపట్లో వెళ్ళిపోయింది. తాను అమిత దయాంతఃకరణులైన గృహస్థుల యింట్లో వున్నట్లు భావించి, రియాబోవిష్ సంతృప్తితో దరహాసవదనుడయ్యేడు.

ఆరోజున అతనికి ఆకలికూడా అనిపించింది. తనముందుంచ బడినవన్నీ తినేస్తున్నాడు, త్రాగేస్తున్నాడు. చుట్టూ వున్నవాళ్లు మాట్లాడు కొనేది యీతనికి వినిపించడమేలేదు. తనకు సంభవించిన యీహఠా

త్సంఘటన నెట్లా అర్థం చేసుకోవాలో అనేదే అతని బుద్ధినంతనీ ఆక్ర మించుకున్నుంది. ఆసంఘటన చిత్రంగానూ, ప్రీతికరంగానూ కూడ వుంది. కానైతే దానికి అర్థం చెప్పడానికి కష్టం అక్కర్లేదు. ఓయువతి, వివాహితగావచ్చు, అవివాహితగావచ్చు—తన ప్రియుణ్ణి ఆచీకటిగదిలో కలుసుకోడానికి సంకేతం యేర్పాటు చేసుకుని వుంటుంది. ఈఅవకాశం కోసం చాల రోజులు నుంచి కనిపెట్టుకుని వుండడంవల్ల ఆమె చాల ఉద్రేకంతో, వొళ్ళు తెలియని స్థితిలోవుంది. ఈపరిస్థితుల్లో రియాబోవిష్ దారి తప్పి వెళ్ళి, ఆగదిలో హఠాత్తుగా నిలబడిపోయేడు, ఎవరికోసమో నిరీక్షిస్తున్నట్లుగా. అతనే తన ప్రియుడనుకుని, ఆతొందరలో నామె ముద్దెట్టుకుని వుంటుంది........ఆముద్దుకి యింతకంటె యింక కారణ మేమి వుంటుంది?

"ఆమె ఎవరై వుంటుంది చెప్మా!" అక్కడి స్త్రీల ముఖాలన్నీ పరికిస్తూ ఆలోచిస్తూన్నాడు, రియాబోవిష్.

"ఆమె పడుచుదే ఐ వుంటుంది. ఎందుకంటే ముసలాళ్ళు తమ ప్రియులతో యిట్లాంటి రహస్య సమాగమా లేర్పాటు చేసుకోరుగా! ఆమె విద్యావంతురాలు, తెలివైనదీకూడ అయివుంటుంది. ఆమె దుస్తుల్లోనూ, రాసుకున్న సెంటులోనూ, కంఠధ్వనిలోనూ యిది ఋజువౌతూంటేనే!........"

అతని దృష్టి ఊదాగౌను పిల్లమీద నిలిచింది. ఎంత ఆకర్షకంగా వుంది! ఆమె భుజాలూ, బాహువులూ చాల అందంగా వున్నాయి; మొహంలో తెలివితేట లుట్టిపడుతూన్నాయి; కంఠం చాలా బాగుంది! ఆమెయే తన అజ్ఞాతప్రియ అయి వుంటుంది. అట్లాటి అందగత్తెగాక వేరొక రవడాని కవకాశం వుండదు........కాని, యిదేమిటి, ఛీ! నవ్వొతూంటే తెచ్చి పెట్టుకున్నట్లున్నది. ముక్కూ, మూతీ యెత్తి బిగించి,

నవ్వుతూంటే, వికారంగా ముసలిరూపు కూడాను. అహఁ. దాంతో అతని బుద్ధికి బ్రేకు పడింది. చూపులు ఆమెను వదలిపెట్టి ముందుకు పయనించేయి. నల్లగౌనుమీద చూపులు నిలిచేయి. ఆమె పిరుదులెంత అందంగా వున్నాయి! గ్లాసు యెత్తి త్రాగుతూన్నప్పుడు ఆమె సౌరూ, తీరూ యెంతబాగున్నాయ్! ఆఁ! ఈమే అయి వుంటుంది.......కాని, అంగసౌష్ఠవం యింకా యేర్పడనేలేదే! అతనిదృష్టి ఆతరువాతి తరుణి మీద వాలింది. శతధా ఆలోచిస్తూన్నాడు.

"ఎవడు చెప్పగలడు? ఐనా ఒకలాగైతే వాగుంటుంది! ఊదా గౌను భుజాలు, బాహువులూ; నల్లగౌను నితంబమూ; లోబితో్క-యెడమప్రక్క- కూర్చున్నదాని కళ్లూ; యివన్నీ కలిపితే........"

తాను కోరుతూన్నాడేగాని టేబిల్‌దగ్గర కూర్చున్నస్త్రీలలో తన పురమాయింపుకి నిలబడగలదే కనిపించడం లేదు! అంచేత, అజ్ఞాత చుంబన ప్రదాతను మనోనేత్రం ముందు చిత్రించుకో నారంభించేడు, రియాబోవిష్.

రాత్రి స్విష్టకృత్తుగా భోజనం చేసేరు. ద్రాక్షారసం పూటుగా పడిందేమో స్మృతిపోయీ పోకండా వుంది, అందరికీ. గృహస్థుకీ గృహిణికీ కృతజ్ఞతాపూర్వకంగా అనేక వందనా లర్పించి, సెలవు తీసుకొన్నారు. ఆరాత్రికి అక్కడే బస యివ్వజాలనందుకు జనరలూ, భార్యాకూడా మరీమరీ మన్నించమని ప్రార్థించేరు.

"మిమ్మల్ని కలుసు కున్నందుకు చాల సంతోషంగా వుంది." అన్నాడు, జనరల్. ఈసారి యీమాటలు హృదయంలోంచే నిజంగా వచ్చి వుంటాయి. వస్తూన్న అతిథులతో కంటె వెళ్ళిపోతూన్న అతిథులతో అధికసరళభావంతో మాట్లాడడం సహజమే కదూ!

"చాల సంతోషంగా వుంది! మీరు మళ్ళీ తిరిగి వెళ్లేటప్పుడు మమ్మల్ని చూసి మరీ వెళ్ళాలిసుమీ. మీకు తెలియందేముంది, ఏదో

యీసామాన్య గృహస్థుని ఆతిధ్యం. ఏదారిని వెడదామని ? గుఱ్ఱాలమీద రాలేదుగాదూ? నడిచి అయితే తోటలోంచి వెళ్ళండి. అది చాల దగ్గర."

ఆఫీసర్లు తోటలోకి వెళ్లేరు. దీపాల వెలుతురూ, గోలాలోనుంచి హఠాత్తుగా రావటంవల్ల తోటలో చాల చీకటిగానూ, నీరవంగానూవుందని పిస్తూంది. గేటుదాటేవరకూయెవరూ మాట్లాడనేలేదు. మస్తుగాతిని, త్రాగి వున్నారేమో మాంచిహుషారుగా నడుస్తున్నారు. వాళ్ళు తెలిసీ తెలియ కండా వుందేమో, యీచిమ్మచీకటీ, యీనీరవనిశ్శబ్దతా వాళ్ళని ఒక్క మాటు అలజడిపెట్టేయి. బహుశా అంతాఒకటే ఆలోచిస్తూండి వుంటారు. "నాక్కూడా జనరల్‌కి మల్లేనే ఓపెద్దభవంతీ, కుటుంబమూ, పూల తోటా యెప్పటికైనా లభిస్తుందా ? నేనూ అతిధి ప్రీతిగా విందులూ అవీ,—బడాయికోసం అయితే మాత్రమేం ?—చేస్తూ, తినిపించి, త్రాగించి, కిర్రెంచగలనా?" ఈ ఆలోచనే అందరిబుఱ్ఱల్లోనూ మెదుల్తూ వుంది.

నోటికి తాళాలు విడిపోయినట్లు, గేటుదాటేక అంతా ఒక్కసారి గానే మాట్లాడ నారంభించేరు. అకారణంగానే నవ్వుతూ, త్రుళ్ళుతూ పోతూన్నారు. నది ఒడ్డుకి వెళ్ళే అడ్డుత్రోవనే పొదలూ, దుబ్బులూ తప్పించుకుంటూ సాగుతూన్నారు. దారీ, తెన్నూ కనుపించడమేలేదు. ఆవలిఒడ్డును చీకటి పూర్తిగా మింగేసింది. నల్లని నీటిలో అక్కడక్కడ నక్షత్రాలు ప్రతిఫలిస్తున్నాయి. నక్షత్రప్రతిబింబాలు నీళ్ళలో కదులుతూ, యీదుతూన్న రీతిని చూస్తే మనకు ప్రవాహం యెంత వేగంగా ప్రవ హిస్తూన్నదీ తెలుస్తుంది. గాలి నిలబడి పోయింది. సగం నిద్రలోంచే అడవికోళ్ళు కూస్తున్న ధ్వనులు ఆవలిగట్టునుంచి వినిపిస్తున్నాయి. ఆఫీ సర్లనే భయమేనా లేకుండా నైటింగేల్ దారిప్రక్కనే పొదమీదకూర్చుని గర్వంతో తన గానసుధను ఒలకపోస్తూంది. ఆఫీసరొకడు ఆగి, పొదను కదిలిస్తూ, అదిలించినా ఆపిట్టమాత్రం పాట మానలేదు.

"హారి దీన్ని తగలెయ్యా!"

"ముష్టిపక్షి! దీనికెంత కావరమోయ్!"

"మమ్మల్నే లెఖ్ఖచెయ్యవుటే పలుగుముండా!"

అంటూ పదిగొంతులు అరిచేయి. ఆహా. వీళ్ళు మిలిటరీ ఆఫీసర్లైతే మానవులు భయపడతారేమోగాని, పక్షికి భయమేమిటి? పాట ఆగనేలేదు.

నదిదగ్గరికి వస్తూన్నకొద్దీ దారి పైకెక్కింది. ఆదారివెళ్ళి చెర్చి దగ్గరే రోడ్డులో కలిసింది. మెరక యెక్కడంతో అంతా అలిసిపోయి, అక్కడే చతికిల పడ్డారు. సిగరెట్లు తీసి వెలిగించి, బాతాఖానీలోకిదిగేరు. మాట్లాడుకోడానికి మాత్రం మహా విషయం మాత్ర మేముందిలెండి. ఆవలిగట్టున యేదో యెఱ్ఱటి వెలుతురు మబ్బుగా కనిపిస్తూంది. "ఆవెలుతురు ఏదేనా చలిమంటబాపతా? ఏయింటి దీపమేనా కిటికీ అద్దాల్లోంచి అట్లా కనిపిస్తూందా? లేకపోతే మరొకటా?" అని తీవ్రంగా చర్చించడం ప్రారంభించేరు. రియాబోవిష్కూడా ఆవైపు చూస్తున్నాడు. ఆవెలుగు తననుచూసి నవ్వుతూ, తనవైపు కన్ను గిలుకుతూన్నట్లనిపించిం దాతనికి. ఒక వేళ దానికీ తెలుసా యేమిటి, ముద్దు సంగతి?!

మకాం చేరుకున్నాక, దుస్తులువిడిచి, రియాబోవిష్ పక్కవాల్చేడు. ఆ యింట్లోనే లెఫ్టినెంటు లోబిత్కో, మెర్స్లియాకోవ్లు కూడా మకాం. మెర్స్లియాకోవ్ మితభాషి, చాల నెమ్మదైనవాడు. యితను చాలా విద్యాసంస్కారం గలవాడని పటాలంలో అంతా అనుకుంటారు. ఇతని చేతిలో యెప్పుడూ "మెసెంజర్ ఆఫ్ యూరప్" అనే పత్రిక వుంటూ వుంటుంది. లోబిత్కోకూడ బట్టలువిడిచి, అసంతృప్తిగా అటు నిటు పచారు చేస్తున్నాడు. హఠాత్తుగా ఆగి, ఆర్డర్లీని పిలిచి, బీర్ తెమ్మని పురమాయించేడు. మెర్స్లియాకోవ్ పక్కవాల్చి, తలగట్ల కొవ్వొత్తిదీపం వెలిగించి పెట్టుకుని, పత్రికాపఠనంలో నిమగ్నుడై పోయేడు.

వెల్లకిలాపడుకుని, యింటికప్పుకేసిచూస్తూ, రియాబోవిష్ ఆలో చిస్తూన్నాడు : "ఆమె ఎవరై వుంటుందబ్బా!"

అతని కంఠాన్నుంచి ఆ సుగంధతైలం యింకా వదలనట్లేవుంది. పైపెచ్చు చెంపమీద పచ్చకర్పూరం పులిమినట్లు జిల జిలగా, చల్లగానూ వుంది. అతని మనోనేత్రం యింద్రజాలంచేసి, ఊదాగౌను పిల్లభుజాలు, బాహువులూ; నల్లగౌను పిల్ల కటినితంబములూ; యింకొకామె కళ్లూ; మరొకతె దుస్తులూ, నగలూ; యిట్లాగే అన్నీ చూస్తూంది. వీటినన్నిటినీ కలిపి, ఒక తరుణీవిగ్రహాన్ని నిర్మించుకుని చూద్దామనుకుంటాడు, పాపం! అవి నిలిస్తేనా ? ఊరిఖే కళ్ళముందు యీ అవయవవిశేషాలన్నీ నాట్యమాడుతూ, కనిపిస్తూ, మాయమౌతున్నాయి. కళ్లుమూసేడు. అన్నీ దృష్టిపథాన్నుంచి మాయమైనాయనుకుంటూంటే, తడబడు పాదధ్వనీ, బట్ట జీరాడిన చప్పుడూ, 'ప్చ్' అంటూ గాఢంగా ముద్దుపెట్టుకున్నసడీ వినిపించేయి! అతని మనస్సు అనిర్వచనీయానందంతో నిండిపోయింది. ఈ ఆనందసముద్రంలో తన మనోనౌకను చుక్కాని వదిలి పోనిస్తూ న్నాడు. ఆర్డర్లీ తిరిగివచ్చి అతని ధ్యానాన్ని భగ్నంచేసేడు. ఎక్కడా బీర్ దొరకలేదని చెప్పిపోతూంటే, లోబిత్కో చాలా ఆందోళన పడి పోయేడు. ఆవతిన్న గొడ్డులా గదిలో అటూయిటూ ఊరిఖే పచారుచేస్తూ, మధ్య మధ్య రియాబోవిష్ మంచందగ్గరా, మెర్స్లియాకోవ్ మంచం దగ్గరా ఆగుతూండడం; "వాడు వట్టి చచ్చుదద్దమ్మకాదూ ? ఏమంటావు? బీర్ సంపాదించలేనివాడు వొట్టి చవటా, అప్రయోజకపు వెధవా కాదుట్రా? ఇంకా సందేహమేమిటంటా?" అనడం,

పత్రికమీదనుంచి దృష్టిమరల్చకుండానే మెర్స్లియాకోవ్,"ఔను, వాడికి యెక్కడా బీరు దొరికివుండదు" అన్నాడు.

"అదే! ఎంచేతాఅంటా? నువ్వట్లా అంటున్నావుకాదూ? ఇక్కడ బీరూ, ముండలూ కూడా పుట్టించుకురానా? పందెం ఎంత వేస్తావో చెప్పు? ఇదుగో, వెడుతూన్నా, యిప్పుడే...........తీసుకు రాలేకపోతే

నాపేరు మారుపేరెట్టండి!" అంటూ లంకించుకున్నాడు, లోబిత్కో.

మాంచి విసురుతో దిరీసంతా వేసేడు; పొడుగుబూట్లు చాలసేపు తంటాలుపడి తొడిగేడు; సిగరెట్టుతీసి, వెలిగించి, నిశ్శబ్దంగానే నడుస్తూ,

"రబ్బెక్, గ్రబ్బెక్, లబ్బెక్!" అంటూ గొణిగి, గుమ్మం దగ్గర ఆగేడు. "దీని తస్సాగొయ్యా! ఎప్పుడూలేంది యిదేమిటో, నాకు ఒంటరిగా వెళ్ళాలని లేదురా. రియాబోవిష్! కాస్తదూరం షికారుపోదాం, రావూ? ఏం?" అన్నాడు.

ఏమీ సమాధానం రాలేదు. ఒక్క నిముషం అక్కడే నిల్చుని, లోబిత్కో వెనకతిరిగి వచ్చేసేడు. మెల్లిగా దిరీసంతా విప్పుకుని, పక్క మీద నడ్డివాల్చేడు. మెర్స్లియాకోవ్ ఒక్క నిట్టూర్పుతో పత్రిక మూసి ఓప్రక్కని పెట్టి, దీపం ఆర్పేసి, పడుకున్నాడు.

"ఔను! మరి!...." సణగుతూనే వున్నాడు, లోబిత్కో. చీకట్లో అతని సిగరెట్టు కొరివిలా కనిపిస్తూనే వుంది.

రియాబోవిష్ కంబళీ ముసుగుతన్ని ముణుచుకుని పడుకున్నాడు. మెదడులో తైతక్కలాడుతూన్న బొమ్మలన్నిటినీ గుదిగుచ్చడానికి ప్రయత్నిస్తున్నాడు. కాని అందులో కృతకృత్యుడు కాలేదు. తన్నెవరో లాలిస్తూన్నట్లు గుంజనగా వినిపిస్తూనే వుందాతనికి. పర్యవసానం తేలకుండానే అతనికి నిద్రపట్టింది. అతని జీవితంలోకి ఏదో శుభావహమైన, ఆహ్లాదకరమైన సంఘటన ప్రవేశించింది. దానికి చాలామూలం, అర్థం లేకపోయినా, అతనికి మధురవేదనా పూరితమైన ఆనందోత్సాహాన్ని ఇస్తూన్నదదే! ఈఆలోచనా ప్రవాహం, భావపరంపర అతన్ని నిద్రలో కూడ వీడలేదు.

ఉదయం నిద్ర లేచేసరికి నిన్నటి అనుభూతి మారింది. మెడ చుట్టూ సుగంధతైలచర్చ చేసినట్లుండటం, చెక్కిలిమీది చల్లదనం,— యీరెండూ వదలిపోయినాయి. కాని అతని హృదయం సంతోషతరం

గాలతో తొణికిసలాడుతూంది నిన్నటికివలెనే. ఉషఃసూర్యుని లేతకిర ణాలు కిటికీ ఫ్రేముకి బంగారుపూత పూస్తున్నాయి; బైట వీధిలోంచి కల కల ధ్వని వినవస్తూ వుంది. రియాబోవిష్ మైమరచిన ఉద్రేకంతో తదేక దృష్టితో చూస్తూ, వింటున్నాడు. గదిబైటే ఎవరో పెద్దగొంతులతో చర్చిస్తున్నారు. అప్పుడే వెనుకనించి వచ్చి వీళ్ళని కలుసుకున్న బేటరీ కమాండర్ లిబిడెట్స్కీ, యింకో సార్జెంటుతో పెద్దగొంతుతో అరుస్తూ చెపుతూన్నాడు. అధికారద్యోతకమైన అస్వరం అలవాటైపోయిందేమో, మరోస్వరం యేదీ అతనికి తెలియదు!

"ఇంకేమిటి?" బిగ్గరిగా అరిచేడు, కమాండరు.

"నాడాలు వేయించేటప్పుడు 'గొలుబూష్కా' కి దెబ్బతగిలింది, సార్! సర్జన్‌గారు ఒంద్రుమట్టీ, కల్లుమడ్డీ పట్టీ వేయించేరు. సార్! పోయినరాత్రి మెకానిక్.ఆర్తీమేవ్, తప్పత్రాగేడండి. అతణ్ణి రిజర్వు గన్ కేరేజిమీద వుంచమని ఆర్డరిచ్చేరండి, యువర్ ఆనర్!"

సార్జంటు యింకా యెన్నో అతి ముఖ్యవిషయాలు దండకంలా చెప్పుకు పోతూన్నాడు. దేరామేకులూ, కొత్తపగ్గాలూ తేవడం మరిచి పోయేడు, కార్పోవ్; ఆఫీసర్లు పోయిన సాయంత్రం వాన్‌రబ్బెక్ యింట గడిపేరు, యిత్యాది ముఖ్యవిషయాలు. సంభాషణ సాగిస్తూనే, లిబిడెట్స్కీ కిటికీలోంచి తొంగిచూసేడు, ఆఫీసర్ల నిద్రముఖాలు కని పించేయి. మొక్కజొన్నపీచులాంటి గడ్డం ముందుకి బెట్టి, కళ్ళు చికి లిస్తూ ఆఫీసర్లని పలకరించేడు, అభివందన పూర్వకంగా.

"మరేం విశేషాలు లేవుగదా?"

"స్వారిగుర్రానికి కొత్తజీను మూలాన్ని పుండయింది" అన్నాడు. లోబిత్కో ఆవలిస్తూనే.

కమాండరు నిట్టూర్చేడు. ఒక్క క్షణం ఆలోచిస్తూన్నట్లుగా వుండి, బిగ్గరగా అన్నాడు :

"అలెగ్జాండ్రా వగ్రఫోవ్నా దగ్గరకి పోవాలనుకుంటున్నా. ఓమాటు వెళ్ళి చూసిరావాలి. సాయంత్రంలోగా దారిలోనే వచ్చి కలుసుకుంటా లే. గుడ్ బై!"

మరో పావుగంటలో బ్రిగేడు బైలుదేరింది. జమీందారు గాదుల దగ్గిరికి వచ్చేసరికి, రియాబోవిష్ దృష్టి లోగిలివైపు పరుగెత్తింది. ఇంకా లోగిలి తలుపులు మూసే వున్నాయి. బహుశా యింట్లో వాళ్ళింకా నిద్ర లేచి వుండరు. ఆమె పండుకొనే వుంటుంది,—నిన్న తనను ముద్దెట్టుకున్నామె! రియాబోవిష్ తన మనోనేత్రం ముందామె నిద్రాముద్రిత సుందరవిగ్రహాన్ని చిత్రించుకున్నాడు. ఆమె పడకగది యిదే; తెరచి వున్న కిటికీలోంచి పచ్చని చెట్టురెమ్మలు లోనికి తొంగి చూస్తున్నాయి. ప్రాతఃకాలపు పిల్లగాలులు మెల్లగా, చల్లగా వీస్తూ, గులాబీ, లిలాక్, పోప్లార్ పుష్పాల వాసనలతో గదిని నింపుతూన్నాయ్. ఆ టేబిల్ మీద గడియారమిదిగో! ఆమె నిన్నతొడిగి, విడిచిపెట్టిన గౌను ఆకుర్చీమీద వుందదిగో! అన్నీ రియాబోవిష్‌కి స్పష్టంగానే వున్నాయి. కాని, యివన్నీ యెందుకూ-? అతను చూడదలచిన దామె నిద్రాముద్రిత దర హాసవదనమూ, ఆమె అంగవిన్యాసమూను! అదాతని కందకుండానే జారిపోతూంది. ఎన్నిసార్లు పట్టుకుందామన్నా ఆమె రూపం పాదరసం వ్రేళ్ళలోంచి జారినట్లుగా జారిపోయి తప్పించుకుంటూంది. మరో పావు మైలు పోయేక తిరిగి చూసేడు, పట్టలేక. పసుపురంగు చర్చీ, యిళ్లూ, తోటలూ, నదీ,—అన్నీ సూర్యకాంతిలో శిరఃస్నానం చేస్తున్నాయి. పచ్చని గట్లమధ్య ప్రవహిస్తూన్న నదిలో వినీలధౌతాకాశం ప్రతిఫలిస్తూ, చాల సుందరంగా వుంది. సూర్యకిరణాలు ప్రతిఫలించినచోట్ల నదిలో వెండిరేకులు పరచినట్లుగా వుంది. వెనక తిరిగి గ్రామం వైపు మరొక సారి చూసేడు. అతని నేత్రాల్లో విచారరేఖలు, ఆశాభంగపు నీడలు క్రమ్ముకొన్నాయి. ఏదో తన కత్యంతసన్నిహితమూ, ప్రియతమమూ ఐన

వాళ్ళని విడిచి, దూరంగా పోతూన్నట్లుగా వుందాతని స్థితి !

రోడ్డుమీద పోతూంటే అన్నీ మామూలు దృశ్యాలే. వాటిలో రియాబోవిష్‌కి రుచి కనిపించలేదు. రెండు ప్రక్కలా గోధుమ, రై చేలు; చేలల్లో పురుగుల్ని యేరుకుతింటూ, దూకుతూ నడుస్తూన్న మాలకాకులు; ముందు రోడ్డుదుమ్మూ, నడుస్తూన్న మానవుల మెడమూపురాలూ; వెనక మానవముఖాలు, యెంతసేపు చూసినా యిదే దృశ్యం. పటాలానికి ముందు అల్లంతదూరంలో నలుగురు సోల్జర్లు తుపాకులు భుజాలమీద పెట్టుకుని అడుగేసి, నడుస్తున్నారు. ఈ అగ్రగామిదళం తర్వాత బ్యాండు దళం; వీళ్ళ మౌనం చూస్తే శవవాహకులా అని పిస్తుంది. వీళ్ళు పటాలపు రూల్సుని మరిచిపోయి, బాగా ముందుకు పోతూన్నా రొక్కొక్కప్పుడు. రియాబోవిష్, తనముందు బోతూన్న నాలుగు బేటరీలనీ యేరుపాటుగా చూడగలుగుతున్నాడు.

భారమైన దీర్ఘకళేబరాన్నీడ్చుకుంటూ పోతూన్న కొండచిలువలా పోతూన్న యీసేనావాహిని బైటవాళ్ళకి వినోదకరంగానూ, కొత్తగానూ వుంటుంది. చచ్చిన పురుగుని చీమలు లాక్కెడుతూన్నట్లుగా ఒక్కొక్క ఫిరంగికి యింతమంది జనం యెందుకో అనుకుంటారు! ఒక్కో ఫిరంగిని యీడవడానికి చిత్రవిచిత్రమైన ముస్తీబులతోటి యిన్ని గుర్రాలెందుకో! పైవాళ్ళ కివన్నీ కుతూహలకరంగానే వున్నా, యీవివరాలన్నిటితోనూ అత్యంత పరిచయమున్న రియాబోవిష్‌కి యీదృశ్యం చాల విసుగుపుట్టిస్తూ, పీడకలలావుంది. ప్రతి బేటరీ ముందూ ఒక ఆఫీసరూ, అతనివెనక మాంచి దిట్టమైన సార్జెంటు-మేజరూ ఎందుకని నడవాలో; ముందువెనక గుర్రాల్ని తోలేవాళ్లు బేటరీల వెనకే యెందుకు వుండాలో; చక్రం దగ్గిరలో కట్టే గుర్రానికి 'వీలర్' అనీ, ముందు గుర్రాన్ని 'లీడర్' అనీ యెందుకంటారో; ఈ వివరాలన్నీ చాలకాలం కిందటే చదువుకున్నాడు. ఈగొడవంతా

అతనికి తలనొప్పి తెప్పిస్తూందిప్పుడు. బండీ గుర్రంమీద స్వారీ చేస్తూన్న సోల్జరు వంటిమీదా, దుస్తులనిండానూ ఎన్నోరోజుల దుమ్ము పేరుకుని వుంది: అతని కాలిపట్టీ శిథిలమై, పీలికలు వ్రేలాడుతున్నాయి. ధూళిధూసరితములైన సోల్జర్లదుస్తులూ, శిథిలమై వ్రేలాడే కాలిపట్టీ,— యివి యితరులకి అసహ్యంగా కనిపించుతూన్నా, రియాబోవిష్‌కి బాగానే వున్నాయి. వాటి ఉపయోగం అతను రోజూ చూస్తూన్నవాడే కదూ? అశ్వికులు ప్రయత్నరహితంగానే, యంత్రపుబొమ్మల్లా స్వారీచేస్తున్నారు. అప్పుడప్పు డో అదిలింపో, కొరడాఛెళుకో తప్పితే వాళ్ళు ఉత్సవిగ్రహా ల్లాగే వున్నారు. ఫిరంగులూ అంత అందంగా వుండవు. ముందుండే లింబరు బండిమీద (రెండు చక్రాలబండీ—దీనికే గుర్రాల్ని పూన్చు తారు.) టార్పాలిన్ సంచులతో ఓట్లున్నాయి. ఫిరంగుల కన్నివైపులా టీపాయీలు, సంచులు, మూటలు, ఒకటేమిటి సమస్త వస్తువులూ వ్రేలాడుతూన్నాయి. ఏదో పెద్దసాధుజంతువును యెందుకో అంతా సాయంపట్టి లాక్కుపోతూన్నట్లుగా వుందీ హంగామా అంతా చూస్తే. ఫిరంగుల ప్రక్కనే దాని తాలూకు గన్నర్‌లు ఆరుగురూ చేతులూపు కుంటూ, రికామిగా నడుస్తున్నారు. ఒకదానివెనక మళ్ళీ యిదే వరసంతా కూడాను. ఒకటి చూస్తే రెండోది చూడనక్కరలేదు. బ్రిగేడుకు ఆరు బేటరీలు; బేటరీకి నాలుగు ఫిరంగులు; ఫిరంగికి ఆరుగురు గన్నర్‌లు. ఈ ఊరేగింపు రెండుమూడు ఫర్లాంగులు వ్యాపించి వుంది. ఆఖరున సామానుబళ్ళు యెన్నో వస్తున్నాయి. ఆలోచిస్తూన్నట్లుగా తల వోరగా వొంచుకుని నడుస్తూన్న గార్దభరాజం "ఉలాగర్" తో యీఊరేగింపుకి ఆశ్వాసాంతం అయిపోతూంది. ఈగాడిదకి చాల చరిత్రే వుంది, మరి. టర్కీనుంచి దీన్ని కొనుక్కొచ్చేడు, ఓబేటరీ కమాండరు.

రియాబోవిష్ యీదృశ్యాన్నంతనూ ఉదాసీనంగా చూస్తూ, వస్తు

న్నాడు. మరోఅప్పుడైతే ఓకునుకు తీసేవాడే. ప్రస్తుతవ్యవహారం రోజూలా లేదుగా, మరి. అతగాడి మనస్సంతా నవోత్సాహంతో నిండి వుంది. బైలుదేరే టప్పుడు, ఆముద్దువ్యవహారమంతా ఏదో చిన్నచమత్కారం క్రింద, ఆషామాషీ చిలిపి చేష్ఠగాను తీసి పారేయ దగినదే అని భావించి, నిశ్చయించుకున్నాడు. కాని అతని నిశ్చయం నిలబడలేదు. ఎంతగా కళ్లేలు బిగబట్టినా మనస్సుని వుండబట్టలేకపోయేడు. కార్య కారణ సంబంధం, తర్కం ఓమూలకి నెట్టి, మనస్సు యీసుఖభావనలకి లొంగిపోతూంటే, రియాబోవిష్ ఏమీ చేయలేకపోయేడు..........

తాను జనరల్ ఒబ్బెక్ కచేరిసావిట్లో కూర్చున్నట్లు; తనతోబాటు అక్కడ ఓయువతి కూర్చున్నట్లు; ఆమె భుజాలు ఊదాగౌను యువతివీ, కటి నితంబాలు నల్లగౌను తరుణివీ అయినట్లూ; ఒక్కసారి ఆస్త్రీ పోలిక అస్పష్టసుందరంగా వుండిపోయీది కూడాను. ఆమెతో తాను సంభాషిస్తూన్నట్లూ అనిపించేది. భావప్రపంచంలోనే ఆమెను పలకరించేవాడు; లాలించేవాడు; హృదయానికి హత్తుకునే వాడు; స్వగృహంలో ఆమెను దిగవిడిచి, యుద్ధాలకి పోయేవాడు.—యుద్ధం పూర్తై కొంతకాలానికి తిరిగి యింటికివచ్చి భార్యాబిడ్డలతో విందులు గుడిచేవాడు; అంతా ఓదీర్ఘమైన సుఖస్వప్నంలా తిరిగి పోతూంది.

ఒక్కక్కచోట గుట్టలు, మెట్టలూ దిగాల్సి వచ్చేది. ముందు నుంచి ఖణేల్మని ఆజ్ఞలు వినవచ్చేవి: "టు-ది-బ్రేక్స్" (బ్రేక్‌లు వెయ్యాలి!) రియాబోవిష్ నోటమ్మటకూడా యాంత్రికంగానే "టు-ది-బ్రేక్స్" అంటూ పొలికేక వచ్చేసేది. ఈదిక్కుమాలిన కేకలు తనసుఖ స్వప్నాల్ని పాడుచేసి, మళ్ళీ యీపాడు ప్రపంచంలోకి తనని విసిరి పారేస్తాయేమో! అని భయపడేవాడు. అయితే యీనిష్ఠుర ప్రపంచంలో ఒకని భావాల్ని మన్నించకపోవడమే పరిపాటిగదా?

దారిలో ఓపల్లెదాటి పోతూంటే పెద్ద యిల్లూ, చుట్టూతోటా కనిపించేయి. కంచిమీదినుంచి చూస్తే రెండు వైపులా ఎత్తైన చెట్లనడుమ దారి, రియాబోవిష్ దృష్టి నాకర్షించింది. అక్కడ భూమి పసుపురంగు; చల్లినట్లుగా గులకరాళ్ళు పడివున్నాయి. ఈభూమిమీద కొండరావిచెట్లు మహా ఏపుగా బైలుదేరుతున్నాయి. ప్రకృతి చాల సుందరంగా వుంది. ........ఈదృశ్యం చూడ్డంతోనే, రియాబోవిష్‌కి ఆదారిలో యెవరో చిన్నపాదాలతో నడుస్తూన్నా రనిపించింది. మళ్లీ స్వప్నదర్శనమే యేమో ? కాదు, నిజమే! అదిగో! ముద్దులసుందరి: అమందగమన ఆమెయే ఐవుండాలి. నిన్న భోజనాలదగ్గర తప్పించుకు పోగలిగింది కాని, యిప్పు డెక్కడికి పోగలదు ? ఆభావసుందరిని తనమనసులోనే, బంధించివైచేడు, ఆతడు! ఆదివ్యసుందరి యింక రియాబోవిష్‌ను గికురించి తప్పించుకు పోలేకనే పోయింది!

మధ్యాహ్నం అయింది. పటాలం వెనకనించి పెద్దగొంతుతో ఆజ్ఞలు వినవచ్చేయి :

"అటెన్‌షన్! ఐస్‌రైట్ ! ఆఫీసర్స్!" (జాగ్రత ! కుడికి చూడండి! ఆఫీసర్లు! )

బ్రిగేడ్ జనరల్ వస్తున్నాడు. అదీ అట్టహాసమంతా ! అతని బండీని రెండు తెల్లగుర్రాలు లాగుతూన్నాయి. రెండో బేటరీదగ్గర బండి నాపించి, జనరల్ ఏమిటో అరిచేడు. అదేమిటో, యెందుకో ఎవరికీ తెలియక పోయినా చాలామంది ఆఫీసర్లు అతని దగ్గరికి పరుగెత్తేరు, గుర్రాల్ని దౌడుతీయిస్తూ.

"ఏం ? విశేషాలేమిటి? " జనరల్ కళ్లు రెండూ చికిలిస్తూ, అడిగేడు. త్రాగడం మూలాన్నో ఏమో అతని కళ్ళు చింతనిప్పుల్లా వున్నాయి.

"ఎవరూ జబ్బుపడలేదుకదా ?" తన ప్రశ్న అసంగతమనీ,

అప్రస్తుతమనీ తెలిస్తేనేమి? తన పెద్దరికం యెట్లా వ్యక్తమవుతుం దేమిటి?

సమాధానం వచ్చింది. విని, ఆలోచిస్తూన్నట్లుగా ఓక్షణం ఊరుగుని, మళ్ళీ ఓఆఫీసరువైపు తిరిగేడు;

"నీమూదోఫిరంగి తాలూకు రెండో అశ్వచోదకుడు కాలిపట్టీ విప్పేసి, బండిమీద తగిలించేడు! పోకిరీ వెధవ! వాణ్ణి శిక్షించు!"

జనరలు ముఖం యెత్తి చూసేసరికి రియాబోవిష్ కనుపించేడు. "నీజీనుపటకాలు చాల పొడుగైపోయేయి, చూడలేదూ?" అన్నాడు, పనిమాలా. ఇల్లాగే యేవేవో అవకతవక రిమార్కులు చేస్తున్నాడు, జనరల్. అతని చూపుల్లో "ఏం చెయ్యనోయ్! అధికారం వస్తే యిల్లా చెయ్యక తప్పదోయ్!" అనే అర్థం కనిపిస్తూనే వుందంతసేపూ. అధికారవైఖరి యింతలోనే మార్చేసి, లోబిత్కో వైపు తిరిగి, చిరునవ్వుతో పలకరించేడు:

"ఏమోయ్! లెఫ్టినెంట్ లోబిత్కో! ఇవాళ యెల్లానో వున్నావేం? అమ్మగారిమీదికి బోయిందా ధ్యాస? ఊహుఁ; అదీసంగతి! విన్నా రయ్యా! మన లోబిత్కో మదాంలూపుఖోవాకోసం బెంగపెట్టుకున్నాడు, పాపం!"

మదాంలూపుఖోవా యెవరంటారా? అనంతకోటి మహిమణుల్లో ఆమె ఒకతె. వయస్సు నలభై దాటింది; ఒడ్డూ పొడుగూవున్న విగ్రహమామెది, జనరల్‌కి పృధుకళేబరాలున్న స్త్రీలైతే సరి, వయస్సుతో నిమిత్తంలేదు. ఆతనిలో అదొక బలహీనతనండి, పోనీ. అందరూ తనవంటి అభిరుచిగలవాళ్లేనని, అతని అనుమానం! ఆఫీసర్లంతా యీసరసానికి సంతోషించక తప్పదుగా మరి! ఒక్కసారి నవ్వేశారు, జనరల్ పని తీరింది. "పోనీయ్! బండి!" అన్నట్లుగా బండీవాణ్ణి వెనకనుంచే స్పృశిస్తూ, ఆఫీసర్లవైపుతిరిగి శాల్యూట్ చేసేడు. బండి సాగిపోయింది.

జనరల్ బండివెనక లేచిన దుమ్ముకేసి చూస్తూ, రియాబోవిష్ ఆలోచిస్తున్నాడు.

"ఏమిటో యిదంతా ఒక స్వప్నంలా కనిపిస్తూన్నా, యిల్లాంటి అనుభవాలు అందరికీ వుండనే వున్నాయి. అందరిజోలీ యెందుకు? మాజనరల్‌నే తీసుకుందాం; అతని కిట్లాంటి చాతుర్మాస్యలెన్నో అయి నయ్. పైపెచ్చు స్వంతంగా పెళ్ళామూ, పిల్లలూ కూడాను! కెప్టెన్ బొష్తర్ సంగతి మరీచిత్రం! ఒంటె మెడ, నడుం లేనేలేదు! అతనూ ప్రేమవ్యాపారంలో పడ్డం, పెళ్ళిచేసుకోవడం,—అన్నీ అయినాయి. ఆమొరటుపీనిగ సాల్మనోవ్,—అంత కటికవాడు యెక్కడా వుండడు. వాడూ ప్రేమించడం, చివరకా వ్యవహారంకూడా అంతే అయింది. నేను మాత్రం అందరు మొగాళ్ళలాంటివాణ్ణి కాదాయేమిటి? నాకు మాత్రం అల్లాంటి అదృష్టం యెందుకు పట్టదూ?...."

తనూ అందరిలాంటి మొగాడే! తన జీవితం యితరుల జీవితా ల్లాంటిదే! ఈ ఆలోచనతో, రియాబోవిష్‌కి బ్రహ్మానందమై పోయింది. ఊహల్ని విచ్చలివిడిగా, కళ్లేలు వదలిపోనిచ్చేడు. ఆమెనూ, ఆమెతో తన భావిజీవిత సౌఖ్యాల్నీ ఊహించుకుని తన్మయుడై పోతూన్నాడు.

బ్రిగేడు ఆరాత్రికే గమ్యస్థానానికి చేరింది. ఆఫీసర్లంతా గుడా రాల్లో విశ్రమించేరు. మామూలుగానే రియాబోవిష్, మెర్స్లియాకోవ్, లోబిత్కోలు ముగ్గురూ ఓగుడారంలోనే భోజనప్రయత్నాలు చేస్తున్నారు. ఓపేకేజిపెట్టె నిలవబెట్టి, దానిచుట్టూ చిన్నపెట్టెలమీద కూర్చుని భోజ నంచేస్తున్నారు. మోకాళ్ళమీద పత్రిక తెరిచిపెట్టుకుని చదువుతూ, మెల్లిగా తింటూన్నాడు, మెర్స్లియాకోవ్. లోబిత్కో వసపోసిన పిట్టలా ఊరిఖేవాగుతూ, గ్లాసులకొద్దీ బీర్ త్రాగేస్తూన్నాడు. ప్రేమస్వప్నాలతో బుర్రతిరిగిపోతూన్న రియాబోవిష్, కిక్కురుమనకుండా గ్లాసులు గ్లాసులే దిగపోసేస్తున్నాడు. మూడోగ్లాసు కంఠందిగేసరికి రియాబోవిష్ మౌనం

వదలిపోయింది, ఒళ్ళు తెలియనిమత్తు, బుర్ర తిప్పే బలహీనతా ఆవేశించినాయి. ఆతని బుద్ధినంతనీ ఆక్రమించికూచున్న నూతనానుభూతిని మిత్రుల చెవిని పారెయ్యాలనే కోరిక రియాబోవిష్ నావేశించడంతో నిశ్శబ్దతాభంగం జరిగింది.

"రబ్బెక్ యింటిదగ్గర నాకు మంచి గమ్మత్తు జరిగింది, తెలుసునురా? డాన్సు జరిగేటప్పుడే నేను బిలియర్డ్సు గదికి వెళ్ళేనుకాదూ." ఆఁ! ఇదంతా నాకెప్పుడూ జరిగేదేలే! అనేటట్లు ముఖం పెట్టి చెపుతూంటే, రియాబోవిష్ కంఠంలో ఉదాసీనతా, తూష్ణీభావమూ వెల్లివిరుస్తున్నాయి. వివరాలతో సహా ముద్దు కథంతా యేకరువుబెట్టినా, ఒక్క నిముషం కంటె యెక్కువ టైం పట్టలేదు. 'ఇదేమిటి చెప్మా, యింత త్వరగా అయిపోయింది?" అనుకుని, రియాబోవిష్ చాల ఆశ్చర్యపడిపోయేడు. అతని ఊహేమిటంటే తన ముద్దుగాథ అర్ధమపక్షం తెల్లారేవరకేనా పడుతుందని! లోబితోక్ ఎవరు యేం చెప్పినా చస్తే నమ్మడు. ఎంచేతో తెలుసా? స్వతహాగా అతనెప్పుడూ నిజం చెప్పడు; అటువంటప్పుడు యితరులు మాత్రం నిజం చెపుతారని అతనెట్లా అనుకుంటాడు?" ఇదెవడు నమ్మి చచ్చేడులే!" అంటూన్నట్లుగా లోబితోక్, చిరునవ్వుతో రియాబోవిష్ వైపు చూసేడు. మెర్స్లియాకోవ్ పత్రికమీది నుంచి దృష్టి మరల్చకుండానే కనుబొమలు పైకెత్తి,

"సందేహమేమిటి? చాల చిత్రంగా వుంది; పరాయిమగాణ్ణి, మాటా మంతీ లేకుండా కౌగలించుకుని ముద్దెట్టుకోడం ఆశ్చర్యమే. బహుశా ఆమె పిచ్చదై వుంటుందనుకుంటా," నన్నాడు.

"ఏమో!" నన్నాడు, రియాబోవిష్, పత్తుగా.

లోబితోక్ ప్రారంభించేడింక కోతలు.

"ఓమాటు నాకూ అచ్చంగా యిల్లాంటిదే జరిగిందిరా! ఏమైందనుకున్నారు? నిరుడు నేను 'కోవ్నా' కి పోతూన్నా. సెకండు క్లాసులో.

బండి అంతా జనంతో క్రిక్కిరిసి పోయింది. కూర్చోడానికే చోటులేదు. ఇంక పడుకోడం సంగతెందుకు? కండక్టరుని పిలిచి వాడి చేతిలో అర రూబులు పెట్టేసరికి, వాడు నాసామాను యెత్తుకుని పడుకొనే బండిలోకి తీసుకుపోయేడు. నేనూ పడుక్కుని, కంబళీ కప్పుకున్నా........అంతా చీకటి. హఠాత్తుగా యెవరో నాభుజం ముట్టుకున్నట్లూ, నాముఖం మీద శ్వాస వదులుతూన్నట్లూ అనిపించి, చెయ్యి పైకి పెట్టి తడిమిచూసేను. ఎవరిదో మోచేయి తాకింది........కళ్ళు తెరిచేను, ఎవరా? అని. చెబితే నమ్మతారో లేదోకాని, తీరా చూస్తే ఆడది! నల్లటి కళ్ళు, ఎర్రటి పెదవులు, మాంచి బలిసిన రొమ్ములు,........"

"రొమ్ముల సంగతి సరేగాని పెదవుల యెర్రదనం చీకట్లో ఎట్లా తెలిసిందిరా, నీకు?" అన్నాడు మెర్స్లియాకోవ్, యాదాలాపంగా అన్నట్లుగా.

లోబిత్కో యేదో కుంటిసమాధానం చెప్పబోయేడు. కుదరక, మెర్స్లియాకోవ్ బుద్ధిమాంద్యానికీ, భావదారిద్ర్యానికీ పరిహసిస్తూ, వెకిలినవ్వు ఆరంభించేడు. రియాబోవిష్‌కి చాల కష్టం తోచింది. చిత్తశుద్ధితో తన పవిత్రానుభూతినిగూర్చి చెపుతూంటే, యీనవ్వులాటేమిటి? ఇంకిట్లాంటివాళ్ళతో యెప్పుడూ చెప్పననుకుని, అక్కడనుంచి లేచి పోయేడు.

క్యాంపు జీవితం ఆరంభమైంది. రోజులు గడచిపోతూన్నాయి. రియాబోవిష్ కేవలంమారిపోయేడు. ఆలోచనలేకాదు, మాటలూ, చేతలూ కూడా కొత్తతరహాయే. ప్రేమించిన వారి వైఖరి అక్షరాలా పట్టుబడిందాతనికి! రోజూ స్నానం చేసేటప్పుడు ఆర్డర్లీ స్నానపు సరంజామా అంతా తెచ్చి నెత్తిమీద నీళ్ళు పోసేవాడు. నీటిధారలు నెత్తిన పడుతూంటే, రియాబోవిష్ బుర్రలో యెన్నో మధురభావాలు గిర్రున తిరిగి

పోయావి. అతని జీవితంలోనికే చొచ్చుకుపోయి వదలిపెట్టడం లేదా నాటి మధురస్మృతి! కస్తూరి మూటగట్టిన గుడ్డలా, వాసనమాత్రం వదల కండా పట్టుకుంది.

అప్పుడప్పుడు, తోడివాళ్ళంతాచేరి ప్రేమకథలూ, ఆడవాళ్ళ ముచ్చట్లూ చెప్పుకుంటూన్న సమయాల్లో రియాబోవిష్ దగ్గిరకి చేరి, బహుశ్రద్ధగా వింటూండేవాడు. తాను పాల్గొని పోరాడిన యుద్ధకథను యెవరైనా చెప్పుకుంటూంటే వింటూ నిల్చున్న యుద్ధవీరుని వైఖరిలా వుండే దట్లాంటి సమయాల్లో రియాబోవిష్ వైఖరి. అప్పుడప్పుడు సాయం సమయాల్లో ఆఫీసర్లంతా గ్రామాల్లోకి షికార్లు కొడుతూండే వాళ్ళు. ఇల్లాటి వాటికి ముందుబంటు లోబిత్కోయే. రియాబోవిష్ తాను కూడా వీటిల్లో పాల్గొంటూన్నా, యేదో మహాపరాధం చేస్తూన్నట్లు మనస్సులోనే బాధపడి పోయీవాడు. యిట్లా ప్రవర్తించటం ఆమెపట్ల యెంత అపచారం? మనసులోనే ఆమెను క్షమార్పణ వేడుకొనేవాడు. ........తీరిక సమయాల్లో ఊరిఖే కూర్చున్నపుడో, నిద్రబట్టని రాత్రు లందో చిన్ననాటి సంఘటనలు, ఆప్తబంధువులూ తలపుకి వచ్చేవారు. ఇంతకి పూర్వం తల్లీ, తండ్రీ, ప్రేమపాత్రులైన కొందరు బంధు మిత్రులూ, తన గుర్రం 'మెస్థిషోక్క',—వీరే. ఇప్పుడు అంతతో ఆగ టంలేదు, అతని భావనాపటిమ. రబ్బెక్, అతని భార్య, ఆచీకటిగది, ఆయపరిచితసుందరి....వీరూ అతని ఆప్తబంధువర్గంలో చేరిపోయేరు, యిప్పుడు!

ఆగస్టు ముప్పైఒకటో తేదీని క్యాంపునుంచి రియాబోవిష్ కొందరు ఆఫీసర్లతోను, రెండు బేటరీలతోనూ వెనక్కి వెళ్ళడానికి ఆర్డర్లు వచ్చేయి. చాలా కాలం తర్వాత సెలవుల కింటికి వెళ్లే విద్యార్థి మనస్సులా అతని మనస్సూ చాల ఉద్రేకం చెందిపోయింది. ఆగ్రామం, చెర్చి, ఆచిత్రాశ్వం, జనరల్ రబ్బెక్ ఆతిథేయం, ఆలోగిలి, అందులోని

చీకటిగదీ—అదీ యింకోసారి చూడాలని ఎంతో ఆరాటపడిపోతూన్నాడు. ప్రేమికులను మోసగించడం అలవాటై పోయిన ఆ 'అంతర్వాణి' చెపుతూనే వుంది, 'ఆమెను' చూస్తావని! ఆమెను యేమని పలకరించను? ఆమెతో ఏమేమి మాట్లాడను? అని ఒకటే ఆలోచన. ఆమె, ఒక వేళ, ఆముద్దుసంగతి అప్పుడే మరచిపోయిందేమో? దురదృష్టవశాత్తూ ఆమెని చూడ్డం పడకపోతే? ప్రియుల విషయంలో కీడును శంకింప చేయడం, ఈపాడు బుద్ధికి యిదో జాడ్యం. "పోనీ, ఏం లేకపోయినా ఒక్కసారి ఆచీకటి గదిలోంచి నడుస్తా, ఆనాటిస్మృతి........"

సాయంతనం కావస్తూంది. దూరంగా దిఙ్మండలంమీద చెర్చి శిఖరాలూ, తెల్లని ధాన్యపుగాదులూ, గ్రామం దగ్గిరి చెట్లతోపూ కనిపిస్తూన్నాయి. రియాబోవిష్ గుండెలు గబగబా కొట్టుకో నారంభించేయి; పరీక్షలో కూర్చోబోయే విద్యార్థిస్థితిలో వున్నాడు. తన ప్రక్కనే స్వారీ చేస్తూన్న తోడి ఆఫీసర్లు యేదో చెపుతూన్నారుగాని, రియాబోవిష్‌కి ఆదేమీ వినిపించడమేలేదు. దూరాన మిలమిల లాడుతూన్న ఆప్రవాహాన్నీ, ఆభవంతి కప్పునీ, పావురాల గూడునీ, దానిచుట్టూ చంక్రమణం చేస్తూన్న పావురాల్నీ, అన్నిటినీ బంగారు కిరణాల్లో ముంచెత్తుతూన్న అస్తమయసూర్యునీ,—ఏదో అనిర్వచనీయమైన తృష్ణాపూరిత నేత్రాలతో ఏకాగ్రంగా త్రాగేస్తున్నాడు.

చెర్చి దగ్గిరికి చేరి విడిసింది, సిబ్బందీ అంతా. క్వార్టరు-మాష్టరు రిపోర్టు వింటున్నాడన్నమాటేకాని, రియాబోవిష్ దృష్టంతా ఆశ్వికుని మీదే వుంది. వాడెప్పుడు వస్తాడా? వాన్‌రబ్బెక్ ఆహ్వానిస్తూన్నాడన యెప్పుడు చెపుతాడా? క్వార్టరు-మాష్టరు ప్రసంగం పూర్తైంది. ఆఫీసర్లు గ్రామంలోకి వెళ్ళిపోయేరు. ఇంకా నిరీక్షిస్తూనే వున్నాడు.

"ఇంకా ఆహ్వానం రాలేదేమిటి, చెప్మా!"........

"మేమిక్కడికి వచ్చినట్లు రబ్బెక్‌కి తెలుస్తుంది. తప్పకండా

మమ్మల్ని ఆహ్వానిస్తాడు." అనుకుంటూ, రియాబోవిష్ గుడారంలోకి వెళ్ళేడు. కొందరు దీపాలు వెలిగిస్తూన్నారు. ఆర్డర్లీలు, సామోవార్ అంటించి, నీళ్లు మరగబెడుతూన్నారు. వాళ్ళని చూసి, రియాబోవిష్‌కి ఆశ్చర్యం కలిగింది. "రబ్బెక్ ఆహ్వానిస్తాడని వీళ్ళకి ఎందుకు తెలియదబ్బా!"

అతనికేమీ తోచటంలేదు. ఏదో అపురూప వస్తువు పారేసుకున్నవాడిలా ఆరాటపడిపోతున్నాడు. ఓమాటు మంచం మీద నడ్డివాల్చేడు. మళ్ళీలేచి, కిటికీలోంచి బైటికి చూసేడు. ఏమో, గుర్రంమీద రబ్బెక్ సేవకుడు వస్తున్నాడేమో? ఎవరూ కనిపించక పోవడంతో, మళ్ళీ పడుకున్నాడు. చివరకి, మనసు పట్టలేక లేచి, వీధిలోకీ, అక్కడినుంచి చెర్చిదగ్గరికీ నడిచి వెళ్లేడు. చతుష్పథం నిర్జనంగా వుంది. అంతాచీకటి. పరధ్యాన్నంగా నడిచిపోతూన్నాడు. గుట్టమీది సెంట్రీలు ముగ్గురూ రియాబోవిష్‌ని హఠాత్తుగా చూసి, అదరిపడి, శాల్యూట్ చేసేరు. యాంత్రికంగా తిరిగి శాల్యూట్ చేసి, నలిగిన కాలిబాటనేపడి, గుట్ట దిగిపోయేడు.

నది ఆవలి తీరాన చంద్రు డుదయిస్తూన్నాడు. ఆకాశమంతా సింధూరవర్ణంగా వుంది. దారిప్రక్క తోటలో యెవరో యిద్దరు స్త్రీలు బిగ్గరగా మాట్లాడుకుంటూ, కేబేజీ ఆకులు కోస్తున్నారు. తోటావలి గుడిసెల నీడలు నల్లగా కనిపిస్తున్నాయి..........అంతా మేనెలలో యెట్లావుందో అట్లాగే వుంది. అదే దారి, అవే రుప్పలు, పెరిగి దారిలోకివాలిన రెల్లు,—అన్నీ అవే. నైటింగేలుపాటా, పోప్లార్ పుష్పాల వాసనా, లేత గడ్డి మొలకలూ మాత్రం కనిపించడం లేదు.

జనరల్ తోటదగ్గిరికి వచ్చేక, ఆగి, రియాబోవిష్ గేట్లోంచి లోపలికి తొంగి చూసేడు. తోటలోకూడ అంతా చీకటి, నిశ్శబ్దం. కొద్దిగజాల వరకూ దారీ, చెట్ల మొదళ్లూ మాత్రం కనిపించుతున్నాయి. ఆతర్వాత

వాటినికూడా నీరవనిబిడాంధకారం మింగేసింది జాగ్రతగా చెవులు రిక్కించి వింటూ, చీకట్లోకి చూసేడు. క్షణాలూ, నిముషాలూ గడిచి పోతున్నాయి. అరగంటయింది. ఎక్కడా మిణుకుమని వెలుతురుగానీ, చిటుకుమని చప్పుడుగానీ లేదు. ప్రాణం విసిగి వెనక్కితిరిగేడు.

నడుస్తున్నాడు; నది దగ్గరికి వచ్చేసరికి యెందుకో ఆగాలనిపించింది. ఎదురుగా, చీకట్లో మెరుస్తూ, జనరల్ స్నానమందిరం అమాయికంగా నిలబడివుంది. దగ్గరలోనే నదిమీది చిన్నవంతెన; దాని రెయిలింగ్‌ని వ్రేలాడుతూ ఏదో కాగితం. ఎందుకో మళ్లీ ఆశ. అప్రయత్నంగా వంతెనమీదకి నడిచి, చేయిచాచి కాగితం అందుకున్నాడు. ఆశ 'గుప్' మని ఆరిపోయింది............స్నానమందిరపు స్ధంబాల్ని ఒరుసుకుంటూ పోతూన్న ప్రవాహం, అస్పష్టంగా మర్మర ధ్వని చేస్తూంది. నీళ్ళలోకి తొంగి చూసేడు, రియాబోవిష్. ఆవలిగట్టుకి దగ్గరగా నీళ్ళల్లో ఎర్రని చంద్రుడు ప్రతిఫలిస్తూన్నాడు. చిన్నకెరటాలు చంద్రుణ్ణి ఊపుతూ, గాలివేసినప్పుడల్లా ముక్కలు ముక్కలుచేసి, మోసుకు పోతున్నాయి. ఎక్కడికో? ఎందుకో?.......ప్రవాహవేగంలోకి శూన్యదృష్టితోచూస్తూ, రియాబోవిష్ అనుకుంటున్నాడు.

"ఎంత బుద్ధితక్కువ! ఎంత బుద్ధితక్కువ! ఇదంతా ఏమిటీ, బుద్ధిహీనత గాకపోతే?"

ఆశాభంగం అయింది. ఆచ్ఛాదన తొలగినట్లైంది. ఆముద్దు, తన కంగారు, స్వప్నసౌధాలు,—యివన్నీ యిప్పుడాతనికి అసంగతంగానే కనిపిస్తూన్నాయి. తమ నాహ్వానిస్తూ, జనరల్ సేవకుడు రాకపోవడంలో ఆశ్చర్యం ఏమీ లేదని యిప్పుడే తెలుస్తూంది! తన ప్రియుడనుకుని ముద్దెట్టుకున్నఆయువతిని తానెప్పటికీకలుసుకోలేకపోవడంలో ఆశ్చర్యం ఏమీలేదని యిప్పుడే తెలుస్తూంది. అంతేగాదు, తిరిగి ఆమెను కలుసు

కోవడం గనక తటస్థించితే, అదీ ఆశ్చర్యపడాల్సిన సంగతి! అన్నీ తెలుస్తున్నాయి, యిప్పుడిప్పుడే........

నీరు ప్రవహించి పోతూంది. ఎక్కడికో? ఎందుకో తనజోలే పట్టించుకున్నట్లు లేదే? మేనెలలోనూ యిట్లాగే ప్రవహించి పోయింది. చిన్ననదులు పెద్దనదుల్లోకి; అవి సముద్రంలోకి; సముద్రంలోంచి ఆవిరిగా; ఆమేఘాలు యెక్కడెక్కడో మళ్ళీ నీటిని కుమ్మరించడం; ఆనీరే మళ్ళీ ప్రవహించడం,—ఎందుకో యీచర్విత చర్వణం! అప్పుడు చూసిన నీటినే యిప్పుడూ తిరిగి చూస్తున్నాడా? ఏమో!

ఆక్షణంలో ప్రపంచమే ఓపెద్ద పరిహాసంగా కనిపించింది. దృష్టిని ప్రవాహం మీదినుంచి మేఘాలమీదికి మరల్చేడు. చటుక్కున అంతా మళ్ళీ జ్ఞాపకం వచ్చింది. అదృష్టదేవతే తనతో పరిహాసం చేస్తూందాఅనిపించింది. ఆమెయే ఆయజ్ఞాతస్త్రీ రూపంలోవచ్చి ముద్దెట్టుకుని, ఆశ చూపింది; వేసవికాలం అంతా తనను వివిధరూపాల్లో వచ్చి, ఊరించింది; చివరకి నిరాశలో ముంచి అదృశ్యమై పోయింది! అదంతా తలుచుకుంటూంటే, తన బ్రతుకు చప్పగా, పాడుగా, బీడుగా వుందనిపించింది, రియాబోవిష్‌కి.

ఈఆలోచనల్లోపడి, మకాంకి తిరిగి వచ్చేసరికి, అక్కడ తోడి ఆఫీసర్లెవరూ లేరు. జనరల్ 'ఫాంట్రాబ్‌కిన్' పంపిన ఆహ్వానాన్నందుకుని, వాళ్ళంతా అక్కడి విందుకి బోయేరని ఆర్డర్లీ చెప్పేడు........ అతని హృదయంలో మళ్ళీ ఆశ, సంతోషం కలిగింది. కాని, ఒక్కక్షణమాత్రమే. వాటిని అణచుకుని, తన్నంత నిర్దాక్షిణ్యంగా భంగపుచ్చిన అదృష్టదేవతను తిరస్కరించడానికా అన్నట్లు, రియాబోవిష్ పోయి పడకమీద వాలి, ముసుగు తన్నేడు........

---

# పెళ్ళి షరతులు.

## పాంతలీమొన్ రోమనోవ్.

టీపార్టీ చాల బాగాజరిగింది. పరీక్షలై పోయినాయేమో. విద్యార్థు లంతా మాంచికులాసాగానూ, హుషార్‌గానూ వున్నారు. నెత్తిమీదిబరువు దించేసినట్లుగావుంది, వాళ్ళకి. లీనా గ్లాన్ గదంతా ఆటపాటలతో, నాట్యాలతో కోలాహలంగావుంది. చివరకిదంతా ఎట్లాపరిణమిస్తుందా? అని యెవరాలోచించేరు.

మధ్యలో బెల్ మోగుతూంటే లీనాయేవెళ్లి తలుపుతీసింది. తిరిగి వచ్చేటపుడామె ముఖంమీద విషాదచ్ఛాయలు కనిపించేయి. పానకంలో పుడకలా యెవరో అవాంఛనీయుడు లోనికివస్తూన్నట్లు ఆమె ముఖవైఖరి చూస్తేనే తెలిసిపోతూంది.

ఆవచ్చినవాడు మరెవరోకాదు. విక్టర్ జోరిన్, ఆకాలేజీ విద్యార్థే. కొద్దిరోజులక్రిందటే అతడు లీనాను కలుసుకోడం తటస్థించింది. అంతే. అప్పటినుంచీ విక్టర్, లీనాను అనుసరించుతూనే వున్నాడు. ఆతని కళ్లలో అగాధమైనప్రేమా, అనవసరమైన అసూయాకూడా చూస్తూంటే, లీనా మహ చిరాకెత్తిపోయిాదంటే ఆశ్చర్యమేముంది? అతన్ని చూసేటప్పటికే యేదో దిగులు, భయం; ఆమె వంటిమీద జెర్రులు పాకుతూన్నట్లనిపించేది. పోనీ, అతనిమీద లీనాకు కేవలం ద్వేషమేనావుంట? అబ్బే, కానేకాదు.

మరేమిటిది? అనేప్రశ్నరావచ్చు. విక్టర్ చాలా పెద్దమనిషి; ఎంతో స్నేహపాత్రుడు; క్లాసందరిలోకీ తెలివైనవాడు. ఇన్ని మంచి గుణా లాతనిలో వున్నా ఆమెకు మాత్రం విక్టర్‌ను చూచేటప్పటికి మనస్సు చివుక్కుమనేది. అతని బిడియం, నలుగురిలోకీ వచ్చినపు

డాతనికంగారు, అందరూ సరదాగా వుంటూంటే తను మూతి బిగించు క్కూచోడం,—ఈ లక్షణాలు చూసేసరికి లీనా భరించలేకపోయేది. అసలు విక్టర్‌కి సంతోషంగా వుండడం, సంతోషం పెట్టడం కూడా తెలియదేమో? అట్లాంటప్పుడు యెంత తెలివైనవాడైతే మాత్రం అతన్ని పెళ్ళి చేసుకొని ఏం సుఖపడాలి?

గదిలో ప్రవేశిస్తూనే అతి సిగ్గుగా స్నేహితబృందాన్ని పలకరించి ఓమూల సోఫాలో కూలబడ్డాడు. సైమన్ గ్రోహోల్‌స్కీ విసిరిన చమత్కారోక్తికి సమాధానమే తోచలేదాతనికి. సోఫాలో ఒక్కడూ కూర్చుని, పొడుగాటి జుట్టు చేతివ్రేళ్ళతో వెనక్కి దువ్వకుంటూ పర ధ్యాన్నంలో పడ్డాడు.

లీనా అతని వైపుకే పోలేదు. అసలే ఆమె చాలా చలాకీగా వుంటుంది. ఆనాడామె మరీ హుషారుగా వుంది. తన్మయత్వంతో బిగ్గ రగా నవ్వుతూంటే ఆమె బంగారు ముంగురులు ముఖాన్ని గప్పివేస్తు న్నాయి. మాటిమాటికీ జుట్టు వెనక్కి తోసుకుంటూ, పాడుతూ, డాన్సు చేస్తూన్న లీనా అందరిలోనూ సంతోషోత్సాహాల్ని రేకెత్తిస్తూంది. కేవల సంతోషదేవత అయిపోయిందా నాడామె. నవ్వి, నవ్వి, ఆయాసం వచ్చి సోఫాలో విరుచుకుపడి జేబురుమాలుతో విసురుకుంటూ జుట్టు సవరించు కొనే లీనాను చూడ్డానికి రెండు కళ్లూ చాలవనిపిస్తూంది.

అతడు చూస్తున్నాడనే తాను మరింత సంతోషంగా, హుషార్‌గా వుండాలని ప్రయత్నిస్తూన్నా ఆవిషయాన్ని తెలియనిచ్చేదికాదు. అతనికి అందంగా కనిపించాలి: మళ్ళీ తనవైపు అతృప్తనయనాలతో చూస్తూ, దృష్టులతోనే ఆరాధిస్తూ, నీడలా వీడక తిరగడం చూచినప్పుడు విక్టర్ మీద విసుగూ కలిగేది. ఈద్వైధీభావంతోలీనా కంగారు పడిపోతూంది.

సైమన్ గ్రోహోల్‌స్కీ చాలా సరదా అయినవాడు. నల్లనిచొక్కా

మీద స్వెట్టర్ తొడిగి, కులాసాగా కబుర్లు చెపుతూ, నవ్వుతూ, అందర్నీ నవ్విస్తూన్నాడు. లీనా సోఫామీద కూర్చోగానే అతడూ వచ్చి చేతిలోని ఆపిల్ పండామె కందిస్తూ, ప్రక్కనే కూర్చున్నాడు. ఆమె నడుంచుట్టూ చేయివేసి పొదువుకుని, యేదో చెప్పి నవ్వడం ఆరంభించేడు. సైమన్ భార్య లైజాకూడ అక్కడేవుంది. ఆమె సన్నగా, నాజూకుగా వుంటుంది. చాల చురుకైనది కూడాను. లైజా నవ్వుతూంటే హృదయం విప్పి నట్లుంటుంది. ఆపిల్సు అందుకోడానికి పందెం వేసినప్పుడల్లా ఆమెదే గెలుపు. చిన్నపిల్లలా గోలచేస్తూ, అంతమందిలోనూ సిసింద్రీలా దూరి పండు లాక్కుని పరుగెత్తి, "నేనే నెగ్గేనోయ్!" అని అరుస్తూ, మన స్ఫూర్తిగా నవ్వేసేది.

విక్టర్ చూపులు తనమీదే వున్నట్లు లీనా కనిపెట్టికూడా ఆరోజున లక్ష్యపెట్టదలచుకోలేదు సైమన్‌తో తనకు యేదో విశేషచనువున్నట్లుగా నటించే సాహసంకూడా విక్టర్‌ను నొప్పించాలనే. ఉన్నట్లుండి హఠాత్తుగా సైమన్ జబ్బ దొరకబుచ్చుకుని అందర్నీ తోసుకుంటూ బైట వసారాలోకి లాక్కుపోయింది, లీనా.

వసారాలోంచి గల్లుమని వానజల్లులా లీనా నవ్వు వినవచ్చింది. తానెంతో కులాసాగా వున్నట్లు అందరికీ తెలుపుతూందా! అన్నట్లుంది, లీనా నవ్వు. ఎప్పుడూ యీదురోమంటూ, తాము సుఖపడలేక, యితరుల్ని సుఖపడనివ్వకుండా చేసేవాళ్ళమీద విసిరిన బాణంలాకూడావుంది, ఆనవ్వు. అటువంటి వాళ్ళమీద తనకెంత నిరసనో విక్టర్ తెలుసుకోవాలని, లీనా అభిప్రాయం. నవ్వు ఆగింది. గదిలో అందరూ యేదో అశుభానికై యెదురు చూస్తూన్నవాళ్ళలా వున్నారు. నిశ్శబ్దంగా నిముషాలు దొర్లిపోతూంటే యుగాలా అని పిస్తున్నాయి. అందరూ మొగమొగాలు చూసుకుంటున్నారు. వివర్ణమైపోయివున్న విక్టర్ ముఖంలో కాతరత్వం కానవస్తూంది. తనదృష్టులు స్నేహితుల దృష్టులతో కలుసుకుంటా

యేమోననే భయంతో విక్టర్ కళ్ళు వాల్చేసి, టేబిల్‌క్లాత్ కొనని వ్రేలికి చుట్టుకుంటూ, కొసదారాలు విడదీస్తూ కూర్చుని వున్నాడు.

"నీమొగుణ్ణి చూసుకోవే, లైజా!" అన్నా రెవరో.

"ఏం ఫరవాలేదు లేవే." ధీమాగానే జవాబిచ్చింది, లైజా.

"ఇంకేం! నువ్వు యీకాలాన్నే దలదన్నుతూన్నావు!"

ప్రతిష్ఠంభన ఆఖరైంది. గాని అందరికీ యెబ్బెట్టుగానే వుంది, లీనా—సైమన్‌లు ఒంటరిగా అంతసేపు వసారాలో వుండడం.

ఉన్నట్టుండి విక్టర్ నిశ్శబ్దంగా లేచి, బైటికి వెళ్ళిపోయేడు.

## 2

మళ్ళీ గదిలో నిశ్శబ్దం వ్యాపించింది. ఒకరి మొగా లొకరు చూసుకుని, అంతా కలిసి ద్వారంవైపు ఆదుర్దాతో చూస్తున్నారు.

ఉత్తరక్షణంలో లీనా, ఆమె వెనక సైమన్ లోపలికి వచ్చేసేరు.

"అమ్మయ్యా! బ్రతికిపోయేనమ్మా! అతడితో ప్రాణం విసికి పోతూందంటే నమ్మండి!" అంది, లీనా.

లైజా అందుకుని, జవాబు చెప్పింది :

"అతనితో నీకు ఋణం తీరిపోయిందిలే, పోనీ. అట్లా జరిగినా నెపం యెవరిమీదా వెయ్యక్కర్లేదు. బాధ్యురాలివి నువ్వే అవుతావు."

"అయితే, యిదేమిటోయ్, ఎక్కడా చూళ్లేదు! ఓమాటు యెక్కడో కలుసుకున్నాము. ఆ స్వల్పపరిచయానికే నామీద తనకేదో అధికారం సంక్రమించినట్లుగా వెంటాడి, నిఘావెడితే యెవరూరుకుంటా రేమిటి ?"

"నీకు అతనిమీద యెందుకిష్టం లేదు? విక్టరు తెలివైనవాడూ, స్నేహపాత్రుడూ, ఎంతో నెమ్మదైన వాడూను. అతడి యోగ్యతలో సగమైన నాసైమన్‌లో వుంటే చాలు ననుకుంటూంటాను!"

భార్య వాక్బాణాలు తగిలి, సైమన్ కనుబొమలెత్తి, ఆశ్చర్యంగా చూసేడు. "ఏమనుకుంటున్నారా!" అన్నట్లుగా అందరివంకా మౌనంగానే దొంగచూపులు చూస్తూ, చిన్న దగ్గు దగ్గి, గ్లాసులో 'వోడ్కా' పోసుకుని, ఒక్క గుక్కను త్రాగేసేడు.

"నాషరతులకి విక్టరు నిలబడలేదు." అంది లీనా,

"ఏమిటో ఆషరతులు?"

"నాస్వతంత్రానికి అడ్డు రాకూడదు. మాటమాటకీ అసూయపడకూడదు. నామీదెవరికో అధికారం వుందని భావించవలసి వచ్చేటట్లు ప్రవర్తించేవాడు నాకక్కర్లేదు. నాయిష్టం వచ్చినట్లు వుండడానికి స్వతంత్రంలేని పెళ్ళి నాకు వొద్దేవొద్దు. ఈవిషయంలో నాకు సైమన్ నచ్చేడు!"

లీనా మాటలు వింటూనే, సైమన్ తనవైపు వ్రేలితో చూపించుకుని, మరోగ్లాసు వోడ్కా కంఠంలో వొంచుకున్నాడు.

"ఈవేళ యెందుకోగాని సైమన్ తమాషా చేస్తున్నాడు. అయితే మరి, నామాటేమంటావు, లీనా? నేనూ యీవిషయంలో నీకు ఆదర్శంగా కనిపించడం లేదూ?" అంది లైజా, భర్తవైపు చూస్తూ.

"ఓ! నువ్వా! కాకేమి? నువ్వూ నాకు నచ్చేవు."

"లేకపోతే, మీయిద్దరి వికవికలు, పకపకలు నేనేమైనా లెక్కచేసేనా? చెప్పు."

లీనా గమ్మున లైజా దగ్గరికి పరుగెత్తి, ఆమెని కౌగలించుకుంది.

"అంటే యెవరూ ఒక్కరినే మనస్ఫూర్తిగా ప్రేమించకూడదనా, నీఅభిప్రాయం?" దూరంగా ఓమూలగా కూర్చున్న పిల్ల చటుక్కున అడిగింది. ఆమె రూపమూ అంత ఆకర్షణీయంగాలేదు, దుస్తులూ అంత డాబుగాలేవు. ఈప్రశ్న అడుగుతూనే ఆమె చెక్కిళ్ళు యెర్రబారి, సిగ్గు పడిపోయింది. రూపవంతులు గానివాళ్ళు యిట్లాటిసందర్భాల్లో సహజంగానే సిగ్గిలుతారు. "ఆఁ! ఈప్రేమ గొడవలు నీమొహాని కెందుకు

లేద్దూ?" అని యెవరో అంటారేమోనని వుంటుంది, వాళ్ళకి. నిజంగా కొందరి ముఖాలమీద అప్పుడే చిరునవ్వులు వెలిసేయి కూడాను!

"నీకు అట్లాంటి ప్రేమ కలిగిందా ఏమిటి చెపుదూ?" అని చమత్కారంగా వ్యంగ్యధోరణిలో సైమన్ అంటించే సరికి సందు దొరికింది గదా అని అంతా నవ్వేసేరు.

"అదికాదు నాఉద్దేశం నేను పసిపిల్లగా వున్నప్పుడు మాఅమ్మ నన్ను గాఢంగా ప్రేమించేదనుకో. కాని, యిప్పుడు నేను పెద్దదాన్నయేను. చిన్నప్పటిలాగే యిప్పుడూ ప్రేమిస్తానంటే నేనేం చేసేది? నాకాప్రేమ అవసరం యేమిటి?" అంది లీనా.

"అతను వెళ్ళిపోయేడని నీకుకష్టంగాలేదూ?" అరూప అడిగింది.

"అస్తమానూ నామీదే రెండు కళ్ళూ పెట్టి చూస్తూంటే నాకు విసుగ్గా వుండదూ? నేనేమాటాడినా అతనికి కష్టంగానే వుంటుంది. ఏమైనా సరే, నాస్వేచ్ఛాభంగాన్ని మాత్రం సహించను సుమా. నామీద, యెవరికైనాసరే, అధికారం వుందనేది నేను అంగీకరించలేను, సహించలేను." అంది, కచ్చితంగానే, లీనా.

"నిజమైన ప్రేమ దేనికైనా ఓర్చుకొనేటట్లు చేయగలదు. లొంగి వుండడానికీ, చివరకి ఆత్మత్యాగానికీకూడా ప్రేమించినవాళ్ళు వెనకతీయరు." ఇట్లా అంటూంటేనే పళ్ళీ అరూప సిగ్గుపడిపోయింది. "నీకేసి యెవడూ చూడడు గనక నువ్వు దేనికైనా లొంగి వుంటానంటావు," అని అందరూ అంటూన్నట్లనిపించి, ఆమె చెక్కిళ్ళు గులాబులైనాయి.

"నీవేదాంతం తుంగలో ఊరదొక్కుదూ, ఎవరిక్కావాలి? కులాసాగా ఉండాలంటా. అంతే." అంది, లీనా.

లీనా ధీమాగా మాట్లాడుతూన్నా లోలోపలేదో ఆందోళన బైలుదేరనేదేరింది. విక్టరావిధంగా పైటికి పోవడంవల్ల అక్కడి పరిస్థితంతా

మారిపోయింది. వెళ్లిపోతూన్నపు డాతని కళ్ళలో యేదో వెర్రిచూపు కనిపించింది. లోపల యెట్లావున్నా పైకి మామూలుగానే కనిపించాలని, లీనా ప్రయత్నిస్తూంది. ఈచిన్న సంఘటనతో తన స్థైర్యం చెడలేదని అందరూ అనుకోవాలని ఆమె తాపత్రయం!

అప్పటికే రాత్రి రెండయింది. ఒక్కొక్కరే వెడతామని లేచేరు. ఒకరొకరిదగ్గర వీడ్కోలు తీసుకోవడంతో కొంత ఆలస్యం అయింది. సైమన్ హాసోక్తులకు ఉబికి వస్తూన్న నవ్వును ప్రక్కగదుల్లో వాళ్ళకి నిద్రాభంగం కలుగకుండా ఆపుకుంటూ, ఒకరినొకరు త్రోసుకుంటూ గుంపుగా వీధులోకి వచ్చేరు.

లీనాకూడా వాళ్ళను కొంచెం దూరందాకా సాగనంపడానికై ఉన్ని కోటు వేసుకుని బైలుదేరింది. తిరిగి వచ్చేలోగా గదిలోని పొగంతా పైకి పోవడానికై కిటికీలన్నీ తెరిచి పెట్టింది.

వీధంతా నిర్మానుష్యంగావుంది. నడివీధులోనే గుంపుగుంపులుగా నడుస్తూన్నారా బృందమంతా. అందరికీ ముందు గట్టిగానవ్వుతూ, కులాసాగా మాట్లాడుతూ లైజా నడుస్తూంది. వెనక సైమన్‌తో మాట్లాడుతూ, లీనా వస్తూంది. చతుష్పథంలో ఆగి, ఒకరినొకరు వీడ్కొంటున్నారు. లీనా సైమన్‌తో ఓక్షణం మాట్లాడి, అందరితోనూ కరసంచాలనంచేసి, జేబురుమా లూపుతూ సెలవు తీసికొని, వెనక తిరిగింది.

తన యింటి గుమ్మంలో అడుగు పెట్టబోతూ, యేప్రక్కనుంచో తనవైపు వస్తూన్న విక్టర్‌ను చూసి, లీనా ఉలిక్కిపడి నిలిచింది.

## 3

లీనాకి మొదట కలిగిన భావం భయం. కంపం పుట్టి, కొంచెం సేపు మ్రాన్పడి నిల్చునిపోయి, మెల్లిగా తేరుకుని ఆతనివైపు నడిచింది. తనసీరీతిగా వెంబడించి, బాధించడమా? విక్టర్‌మీద ఆమెకి చాలకోపం వచ్చింది. ఆమె మనస్సు తిరుగుబాటు చేస్తూంది.

తన కట్లాటి యోగ్యతలేదు గాబట్టి నలుగురిలోనూ కులాసాగా మసలుకోలేడు. పైగా పొంచుండి, ఒంటరిగా చిక్కినప్పుడు మనుషుల్ని పట్టుకుని బాధ పెడతాడా? ఇంక యిట్లాటివాని విషయంలో మెత్తగా వుండకూడదు.

"ఏమిటి? ఎందుకూ యిదంతా?" నిష్ఠురత్వం, నిరసనా నిండిన కంఠంతో అడిగింది, లీనా.

"నీతో కొంచెం మాట్లాడాలి."

"దేన్నిగురించి?"

"దేన్నిగురించో నీకూ తెలుసు."

"అహఁ! నాకు తెలియదు."

"అయితే సరే. నే చెపుతాలే. రా అట్లా కొంచెం నడుద్దాం."

అయిష్టతతో లీనా గతుక్కుమంది. కాని, విక్టర్ నడుస్తూంటే అతని వెనకే నడవ నారంభించింది.

"నిన్ను ప్రేమిస్తూన్నానని యెరుగుదువు కాదూ?" ఉత్కంఠతో అన్నాడు, విక్టర్.

"అబ్బబ్బా! యెప్పుడూ ఒకటే గొడవ!" అన్నట్లుగా చేతులు విదిలిస్తూ అభినయం చేసింది, లీనా.

విక్టర్ టోపీ తీసి, చేతిలో పట్టుకుని, జుట్టుని వ్రేళ్ళతో అదే పనిగా వెనక్కి దువ్వుకుంటూ, నడుస్తూన్నాడు.

"నాస్వభావం తెలుసును గాదు. వెధవకబుర్లు చెప్పడం నాకిష్టం వుండదు, సైమన్‌కి మల్లె. వాడో వట్టి గాంధోళిగాడు. మరెందుకూ పనికిరాడు."

"అయితే ఏమంటావు? అదేమీ చెడ్డగుణం కాదులే!" కోపంగా యెదిరించింది, లీనా.

"అహఁ! నీకట్లా వుండడమే నచ్చుతుందన్నమాట."

"నాకేది నచ్చుతుందో నీతో చెప్పాలాయేమిటి? నాదగ్గర్నుంచి సంజాయిషీ అడగడానికి నీకు హక్కు ఎవడిచ్చాడంటా?"

"ఉంది. నాకు హక్కుంది........"

"ఓహో! అట్లాగా!........ఎవరు....హక్కు నిచ్చేరనే అడుగుతున్నా?"

"నాలోని హృదయపూర్వకమైన ప్రేమ!"

"నాకిష్టం లేదు. గాంభీర్యం, లోతు మనస్సు,—వీటిలోపల వుండేది క్రూరత్వమే. నాకు తెలుసు."

"నీకు తాళాతోళీ తనమే నచ్చుతుందన్నమాట. ఈవేళ ఒకడితో రేపు యింకోడితో కులాసాగా షికార్లు కొట్టమేగాదూ, నీక్కావలసింది?"

"అదేనయం! ముంగిలా మూతి ముడుచుక్కూచునే వాడితో కాలం గడపడం కంటే, అదే వెయ్యిరెట్లు నయం!"

"సరే. నీకు మనిషి విలువతో పనిలేదు. ఏవో కులాసా, దిలాసా కభుర్లు కావాలి! అంతేగాదూ? అర్థంలేని వాగుడుతో నవ్విస్తూ, తానూ పళ్ళికిలించేవాడే నీదృష్టిలో అధికుడు. ఓహో!"

"పైమాటల్నిబట్టి మనిషి తరహా యెవరు చెప్పగలరు? నలుగురి లోనూ యేదో కులాసా కబుర్లు చెప్పేవాడే గావచ్చు, కాని, ఒంటరిగా వున్నప్పుడు.......'"

"ఒంటరిగానా?" అనడుగుతూంటేనే, విక్టర్ ముఖం తెల్లగా అయింది.

"ఏమీలేదు." మాటను త్రుంచేసింది, లీనా.

"నీకూ, వాడికీ ఒంటరి సమావేశాలైనట్లు నాకు తెలియదు. ఏమిటీ! కొత్తసంగతే!"

తాను సైమన్‌ని యీవేళ కాస్సేపు వరండాలో తప్పితే మరెప్పుడూ ఒంటరిగా కలుసుకోలేదని చెప్పెయ్యాలనుకుంది, లీనా. పైకి ఏదో

చమత్కారంగా మాట్లాడుతాడేగాని హృదయంలో యెట్లాటికుట్రా లేని వాడనికూడా చెప్పాలనుకుంది. కాని ఆమె కోపం, విక్టర్ మీదవున్న అసంతృప్తీ,—ఆమెలోని యీమాటల్ని పైకి రానీయలేదు. విక్టర్‌ని నొప్పించి, గాయపర్చాలనే ఈర్ష్యతో లీనా మనస్సు కఠినం అయిపోయింది. అందుచేతనే, తనకూ, సైమన్‌కూ మధ్య యేదోవుందని విక్టర్ అనుకొనేటట్లు చేయాలని, ఆమె మాట్లాడకూరుకుంది.

"అయితే నువ్వూ సైమనూ వరాండాలోకి వెళ్ళింది, యాదాలాపంగా కాదన్నమాట?" కోపం, నిరసనా ఆతని స్వరంలో ఉబికి వస్తున్నాయి.

"కాదు. ఊరికేకాదు." లీనాకూడా కోపంగానే జవాబు చెప్పింది.

"నేను వెళ్ళిపోయేవరకైనా వుండబట్టలేక పోయేవన్నమాట!"

"అంతా మళ్ళీ యెప్పటిసోదే. నువ్వు నాకక్కర్లేదని చాలరోజుల క్రిందటే చెప్పానుగా? నేను నిన్ను ప్రేమించడం లేదు. నాషరతులకి నువ్వు నిలబడలేవు." ఆమె స్వరంలో విసుగుదలా, నిరసనా కనిపిస్తున్నాయి.

"ఏం?" అంటూంటే విక్టర్ కంఠంలో యేదో అడ్డుపడింది. చూపులు క్రిందికి వాలిపోయేయి.

లీనాకి చాల చిరాకు వేసింది. చెప్పడానికి వీల్లేని విషయాలకి వివరాలూ, జవాబులూ అడుగుతాడు! యీమనిషి. ఆమెకి యేంచేయడానికీ తోచలేదు. కాని, ఆమె నోటికి వచ్చిన మాటలు మాత్రం అతన్ని తీవ్రంగా గాయపరచేవీ, బాధించేవీను.

"ఏమా? ఎందుకో చెప్పనా? అస్తమానం నావెంటబడి, నిఘా చేస్తావుగనక! నేను నీతో వేగలేను గనక! నువ్వు నాకేమీ స్వతంత్రం యివ్వలేదుగనక!........నువ్వు, నాకు చాల అసహ్యం కలిగిస్తున్నావు గనక!........తెలిసిందా, యీమాటు?"

రాతిబొమ్మలా నిలబడిపోయిన విక్టర్ ముఖం నల్లగామాడిపో

యింది. వీరున్న చోట నదీఘట్టాన. నీటివైపు వీపుంచి లీనా, ఆమె కెదురుగా విక్టర్ నిలవబడి మాట్లాడుతున్నారు. కొంచెంసేపటికి విక్టర్ మాట్లాడగల్గేడు.

"అయితే, యింతేకాదూ? ఇదే ఆఖరిమాట?"

"నీకు యింకా ఏం స్పష్టంగా చెప్పాలేమిటి?" విసిరేసింది, లీనా.

విక్టర్ నిశ్శబ్దంగా లీనా వైపు చూసేడు. ఆమె కళ్ళల్లో అసహ్యం. నిరాదరణా పొంగి పొర్లిపోతున్నాయి. విక్టర్‌కి గుండెల్లో యేదో బరువు పెట్టినట్లైంది. ఆతని మస్తిష్కంలోని కేవో భావాలు విద్యుద్వేగంతో పరుగెత్తినట్లైంది ద్వేషం, నిరాదరణలతో నిండి, మెరిసిపోతూన్న లీనా రెండు కండ్లనూ పిడికిలితో గ్రుద్ది, చితుకకొట్టెయ్యాలనే కోరిక విక్టరు నావేశించింది. ఆమె ముఖం చితక్కొట్టి, కళ్ళు పీకేయాలనే ముందుకు అడుగు వేసేడు. అతనికి వళ్ళు తెలియడంలేదు. ఎవరో ఆపుతూన్నట్లయింది. కొట్టి పిండిచేయాలని మీదకి పోయినవాడల్లా చివరకి లీనాను గుండెలమీద చెయ్యేసి మెల్లిగా త్రోస్తూ, "నీయిష్టం వచ్చిన చోటికే పో, పాపిష్ఠిదానా!" అన్నాడు.

ఘట్టం నీటికి పైన బాగా యెత్తుగా వుంది. ఓడలు నిలడబడానికి కూడ యీఘట్టాలు ఉపయోగిస్తాయి. చివర నిల్చున్నారేమో, విక్టర్ త్రోపుకి లీనా తూలి వెనక్కి పడబోయి ఆపుకుని, ముందుకి అడుగేసింది. ఆమె ప్రతిఘటన చేస్తూందనే భావంతోబాటు తీవ్రప్రతీకారవాంఛ విక్టర్ బుర్రలో ప్రవేశించింది. ఆతనికి ఒళ్ళుతెలియని ఆవేశం కలిగి,—

"ఎక్కడికి పోతావు? ఆగు!" అంటూనే తటాలున ముందుకు అడుగేసి ఆమెను వెనక్కి త్రోసేసేడు. వెనక్కి నీళ్ళలో పడిపోబోతూ, తటాలున ఆతని చొక్కా చేతిని పట్టుకుంది, లీనా.

"నేను నీకు అసహ్యం వేస్తున్నానుకాదూ?" అంటూ విక్టరామె చొక్కాను గుండెలదగ్గిర పిడికిలితో గట్టిగా పట్టుకొని, నిలవదీసేడు.

లీనాకీ కోపంతో ఒళ్ళు తెలియడంలేదు. నదిలో పడిపోతానేమో అనే భయంకంటె, ఏమాటలతో అతనికి గాయం తగిలి, చిత్తైపోతాడా? అనేదే లీనా ఆలోచనల నాక్రమించుకుని కూచుంది.

"నువ్వంటే అసహ్యమేగాదు, ద్వేషం కూడాను." అంది లీనా, ఉద్రేకంగా. ఆమె చొక్కాను పట్టుకున్న పిడికిలితోనే బలంగా వెనక్కి తోసేసేటప్పుడు విక్టరుకి ఒళ్ళు తెలియడంలేదు. ప్రాణభయంతో లీనా చేతికి దొరకిన అతని చొక్కాను పట్టుకుంది. ఆమె కండ్లలో మరణ భీతిని చూడ్డంతో విక్టర్ మరీ రెచ్చిపోయేడు. ఆమె చేతులమీద బాదుతూ చొక్కాను వదలిపించుకున్నాడు.

మరుక్షణంలో ఘట్టంమీద విక్టర్ ఒక్కడే నిలబడి వున్నాడు. చుట్టూ నిర్మానుష్యంగాను, నీరవంగానూ వుంది. ఏదో బరువైన వస్తువు నీళ్ళలో పడ్డచప్పుడు క్రిందినించి వినిపించింది. మళ్ళీ అంతా నిశ్శబ్దత ఆవరించింది. తెల్లవారడానికి యింకెంతో వ్యవధిలేదు. విక్టర్‌కి కొంచెం సేపటికి స్మృతి వచ్చింది. ద్వేషంపోయి, దాని స్థానాన్ని భయం ఆక్ర మించింది. విక్టర్ కళ్ళు విప్పారినాయి. రెప్పవాల్చకుండా కొంచెంసేపు శూన్యంగా చూసి, రెండు చేతులతోనూ తల పట్టుకుని, పరుగు ప్రారం భించేడు. నీటిలోకి చూడ్డానికేనా అతనికి ధైర్యం లేకపోయింది.

## 4

కొంచెం సేపట్లో రైలు బైరుదేరుతుంది. విక్టర్ హడావుడిగా స్టేషన్‌కి వచ్చి, తన ఊరికి టికెట్టుకొని, బండిలో కూర్చున్నాడు. అతడు యమయాతన ననుభవిస్తూన్నాడు. పెట్టెలోంచి బైటికి చూడ్డానికే భయపడుతూన్నాడు. రైల్వే కండక్టరు ఏదో పనిమీద పెట్టిలోకి వచ్చి నప్పుడల్లా అతనిలో వణకుపుట్టేది. ప్లాట్‌ఫారంమీద మిలిటరీ యూని ఫారంతో, మొలలో పిస్తోలుతో యెవరైనా కనిపించినప్పుడల్లా అలసి

పైప్రాణం పైనే యెగిరిపోయేది. మొగం అటు త్రిప్పుకుని, దేన్నో చూస్తూన్నట్లు నటిస్తూన్నా, యెవరేనా తనను యెరస్టుచేయడానికి వస్తూన్నారేమోనని ప్లాట్‌ఫారం వైపు దొంగచూపులు చూస్తూనే వున్నాడు. ముఖం చాటుచేసుకుంటేనైనా కొంతవరకు తప్పించుకో వచ్చునని ఆశ:

"వాళ్ళు నన్ను యెరస్టుచేస్తే యేమౌతుంది?" అనుకున్నాడు. ఏమైనా యింకీజీవితంతో అతనికి ప్రయోజనం ఏమిటి? మనసార ప్రేమించిన స్త్రీని చేతులారా నీటత్రోసి, తానే చంపేసేడు. ఇంక తనకు మిగిలిన దేమున్నది. జీవించాల్సిన అవసరం మాత్రం యింక తనకే మున్నది? కాని, చావంటే యింత భయం వేస్తూందేమిటి?

అయినా, అతనికి భయం మాత్రం పోలేదు........

ఈ మనస్థితితోనే తన గ్రామం చేరుకున్నాడు. అక్కడకు పోయినా ఈబాధ తప్పలేదు. క్షణం యుగంగా గడుస్తూంది. నిరంతరా వేదనతో మర్మరబాధ ననుభవిస్తూన్నాడు. ముసలితల్లీ, చెల్లెలూ అడిగేరు, "ఎల్లాగో వుంటున్నావేమిట్రా?" అని. "అబ్బే! ఏం లేదే. మామూలుగానే వున్నానే!" అని సమాధానం యిచ్చేసి, తప్పించుకుంటూ వచ్చేడు. వాళ్ళకి యేదో వుందని అనుమానం తగిలింది. అతనేమీ చెప్పడు. తల్లీ, చెల్లెలూ తనవైపు నిదానంగా చూస్తూన్నారనీ, వాళ్లు తన విషయం తెలుసుకోవాలను కుంటున్నారనీ విక్టర్ గ్రహించేడు. వాళ్ళ మౌనం. రహస్యదృష్టులూ, విక్టర్ని మరీ బాధిస్తూన్నాయి. రోజులు చాల కష్టంగా గడుస్తున్నాయి. అతని తల్లి చాల వృద్ధురాలైంది. ఒకనాడుదయమే దేవాలయాన్నుంచి వచ్చింది. నల్లని శాలువా వంటినిండా కప్పుకుని, మౌనంగా నిట్టూర్పుల నడచుకుంటూ కుమారుని గదిలోకి ప్రవేశించింది. విక్టర్ ఆమెని చూసి, యేదో పనిలో మునిగి వున్నట్లుగా నటిస్తూ, టేబిల్ దగ్గరే కూర్చుని వున్నాడు. ఆమె మెల్లిగా కుమారుని సమీపించి, నుదురు ముద్దెట్టుకుంది. తానొక హంతకుణ్ణి ముద్దెట్టుకుం

టూన్నట్లు ఆమెకి తెలియదుకదా! అన్న ఆలోచన అప్రయత్నంగానే విక్టర్ బుర్రలో తిరిగి, తనమీదనే అసహ్యం కలిగిం దాతనికి.

రోజూ ఉదయమే వార్తాపత్రికను చూడడం అతని కలవాటు. పత్రికను తెరుస్తూంటే యిప్పుడాతని చేతులు వణకుతూన్నాయి. ఆమె హత్యావార్తను తనకళ్ళతోచూసి, విశ్వసించాల్సి వస్తుందేమో! తడబడుతూ, భయంతో వార్తల్ని దొంగచూపులుచూస్తూ, కుర్చీలో చాలసేపు కూలబడిపోయేవాడు.

చివరకి ఓరోజున అతను భయపడుతూన్నట్లే జరిగింది. ఆరోజు పత్రికలో ఒక వార్తపడింది. శరీరం రోమాంచమై, వళ్ళంతా ముచ్చెమటలూ పోసినాయి. మానోక్దగ్గర నదిలో ఒక స్త్రీ కళేబరం దొరికిందనీ, ఆమె తలబ్రద్దలై చనిపోయిందనీ, అప్పటికే ఆ శరీరం క్రుళ్ళిపోయిందనీ;........ఆ క్రుళ్ళిన శరీరమే ఒకప్పుడు ఆమె! ఒక్కనెల క్రిందటే తన ప్రేయసి!.... ఆమెను తానెంత గాఢంగా ప్రేమించేడు. అప్పుడేకాదు, యిప్పటికీ తా నామెను,- ఆమె యిప్పుడింక లేకపోయినా- వెర్రిగా ప్రేమిస్తూనే వున్నాడు........అట్లాంటిది యిప్పుడు ఒక క్రుళ్ళిన కట్టె. తాను ప్రేమించినది దేనిని? ఆమె శరీరాన్నే? ఆమెలో తాను చూడగల్గిందేమిటి? విక్టర్ కళ్ళముందర యేదో మబ్బుగ్రమ్మినట్లయింది. జరిగినదంతా తెరమీదలాగే అతని కండ్లముందు తిరిగిపోయింది. ఆమె తననంతగా అసహ్యించుకోవడంవల్లనే సైమన్‌తో లాలనగా మాట్లాడిందేమో?

ఆమె చనిపోయిందని విక్టర్ మనస్సు అంగీకరించడంలేదు. ఆహా!! ఆమె, లీనా,- కుళ్ళినకట్టె యెప్పటికీ కాజాలదని అతని అంతరాత్మ ఘోషిస్తూంది. ఏంచేయడానికీ తోచని విమూఢత్వంతో, శూన్యదృష్టులతో చూస్తూ, గంటలకొద్దీ అట్లాగే కూర్చుని కాలంగడుపుతూ

న్నాడు. తనకు అశుభం, అహితం అయినదేదో అసంభవం, అసత్యం కాకూడదా ? అనుకుంటాడు.

అతని జీవితం దుర్భరమైపోయింది. పొలాల్లో ఒంటరిగా తిరుగుతూ, ఏదో భూతాన్ని చూసినవాడిలాగ తటాలున నిలబడిపోతూంటాడు. ఎదురుగా వెర్రిచూపులుచూస్తూ, పరధ్యాన్నంగా చేతివ్రేళ్ళు మెటికలు విరుస్తూ, బిగ్గరగా తనలో తానే గొణుక్కుంటుంటాడు.

"నిన్ను ప్రేమిస్తున్నాను........కాని, నువ్వు చచ్చిపోయేవు! ఎందుకూ ?....ఇంకరావూ ?....శరీరం క్రుళ్ళిపోయిందా!....అయ్యయ్యో! ఎంత కటికవాణ్ణి !... ఆ కడపటిక్షణాలు తలచుకుంటేనే.... ఆ క్షణాలు తిరిగివస్తే.... ఆమెకి సంపూర్ణస్వేచ్ఛ నిచ్చేస్తా....తన్నెవరో నిర్బంధిస్తూన్నారనే భావం కలగకుండా జాగ్రతగా మసలుతాను.... నువ్వు నన్ను ప్రేమించనక్కర్లేదు....నీకు కేవలం మిత్రునిగా అనుగ్రహించేవంటే అంతేచాలు....తెలిసింది, అంతాతెలిసింది.... నీ షరతులన్నిటికీ అంగీకరించి వుండేవాణ్ణే....ఒక్కసారి ఆ ఘడియలు తిరిగిరాకూడదమా?...."

ఒకనాడాతని తల్లి ప్రేమగా తలనిమురుతూ అడిగింది;

"ఇదేమిట్రా, నాయనా ! యిట్లా అయిపోతున్నావు ?"

విక్టర్ గదిలోకిపోయి అద్దంలో చూసుకున్నాడు. ముఖం, కళ్లు- అంతా మారిపోయింది. జుట్టు ఒకచోట నెరిసి, తెల్లగా అయిపోయింది.

తానేదో రహస్యం దాచుతూన్నట్లు తల్లికీ, చెల్లెలికీ తెలిసిపోయింది. ఈ ఊహతో అతని మనసు మరీ బాధపడిపోతూంది. ఇట్లాంటి జీవితాన్ని తానింక ఒక్కరోజూకూడా భరించలేడు. జీవితమంటేనే విరక్తి కలిగింది. ఆమె వెళ్ళిపోయింది. తనను అసహ్యించుకుంటూనే ఆమె వెళ్ళిపోయింది! ఈ ప్రపంచాన్నే వదలి వెళ్ళిపోయింది. ఇంకా తానిక్కడ ఉద్యోగమనీ, జీతమనీ ప్రాకులాడుతూ ఎట్లా వుండగలడు ? అసంభవం, అవమానకరం !

ప్రేమఅంటే ఏమిటి? దానిరహస్యం యేమిటో? ఒకడు ఎంత గొప్పవాడైనా, పురుషశ్రేష్ఠుడైనా కావచ్చు. స్త్రీని నిర్బంధంలో వుంచుతే యెటువంటివాణ్ణీ ఆమె నిరసించి, ద్వేషించితీరుతుంది, కాని, అదే సమయంలోనే స్త్రీ, ఒక పరమ దౌర్భాగ్యుణ్ణి, హంతకుణ్ణికూడా మనస్ఫూర్తిగా ప్రేమించగలదు? అట్లాంటపుడు ఈ ప్రేమించడం అనేదాని తత్త్వం ఏమిటో? తనకు ప్రేమించడం యెవరునేర్పేరు? అందులోనూ ఆమెను, లీనాను? ఆమె తన కెవరు? ఆమెవల్ల తనకులభించినదేమిటి? బాధలు, అసూయాద్వేషాలు, అభిమానం దెబ్బతినడం,— యివేగామా ఆమెవల్ల తనకులభించినవి? ఇంతెందుకూ? తాను డాక్టరు కాబోతూన్న వాడాయె; మానవాతీతమైన శక్తులులేవని తనకు తెలుసును. కాని, యీ ప్రేమఅనేశక్తి ఏమిటిది? మానవుని శారీరక లక్షణాలతోగాని, నైతిక ధర్మాలతోగాని, దీనికి పనివున్నట్లు లేదే! మరి యీక్షేత్రంలో పని చేయగల శక్తులు, లక్షణాలు ఏమిటి?........ జీవించి వుండగానైనా, లీనా కోరినవన్నీ యిచ్చేసినా.... ఆమె ప్రేమ తనకు లభ్యమయేదో? లేదో?

ఈ వేదన దుర్భరం అయిపోయింది. అక్కడికివెళ్ళి, ఆ స్థలం చూడాలి. వ్యాధుణ్ణిచూసిన లేడిలా భయభ్రాంత నేత్రాలతో, ప్లాన ముఖంతో, మృత్యుభీతితో తనచొక్కాను పట్టుకొన్న ప్రేయసి చేతుల్ని విదిలించివైచి, ఆమెను మృత్యువుపాల్జేసిన ఆ స్థలాన్ని ఆఖరుసారి చూస్తాడు.........విషం పుచ్చుకుంటాడు. అంతా ఆఖరవుతుంది.........

ఇంకేమీ ఆలస్యం చెయ్యలేదు. సరాసరిగా మాస్కో-స్టేషన్‌నుంచే నదీ స్థానానికి బైలుదేరేడు.

సాయంత్రం చీకటి పడింది. పట్టణం తన ప్రశాతంత సౌందర్యాన్ని ప్రదర్శిస్తోంది. ఎక్కడా, ఎప్పుడూ, ఏవిశేషమూ జరిగినట్లే లేదు. అంతా యథాపూర్వకంగానే వుంది. లాగులు మోకాళ్ళపైకి మలుపుకుని జాలర్లు నదిలో వలలు లాగుతూన్నారు. చొక్కాలను కాళ్ళ

నడిమినుంచి వెనక్కి బిగించి దోపుకుని నదిలో గులకరాళ్ళ రేవుల్లో స్త్రీలు బట్టలు ఝాడిస్తూన్నారు. సమీప దేవాలయంలోని గంట సాయం తన ప్రార్థనకి పిలుస్తూంది. చిరుగాలికి పిల్లతరంగాలు రెపరెపలాడుతూన్నా నది ప్రశాంతంగానే ప్రవహించి పోతూంది.

నదీఘట్టం సమీపిస్తూన్నకొద్దీ విక్టరు గుండెలు గబగబా కొట్టుకుంటున్నాయి.

ఇదే స్థలం........రెయిలింగ్ చాల క్రిందుగా వుంది. ఇక్కడే. విక్టరు నిలబడి క్రిందికి నదిలోకి చూసేడు. కళ్ళు చీకట్లు గ్రమ్మినాయి. పచ్చనికాంతి చక్రాలూ, నల్లని చుక్కలూ కళ్ళయెదుట గిర్రున తిరిగిపోసాగినాయి.

ఆస్థితిలో అక్కడెంతసేపు నిలుచున్నాడో అతనికే తెలియదు. స్మృతి వచ్చి చూసేసరికి నదీఘట్టం. క్రింద యేరాతిమీదపడి ఆమెతల బ్రద్దలై పోయిందో అని నిదానించి చూసేడు. కాని, అక్కడ రాళ్లే లేవు. స్నిగ్ధనదీజలాలు మెల్లగా ప్రవహిస్తున్నాయి.

"అయ్యో! మళ్ళీ ఆక్షణం నాజీవితంలో తిరిగి వస్తుందా?"

హఠాత్తుగా యెందుకో వెనక తిరిగి చూసేడు. ట్రామ్‌బండి పోతూంది, దానిలో ఓకిటికీ దగ్గర లీనా ముఖం కనిపించింది!

# 5

అంతా అచ్చంగా ఆమె ముఖమే. కానైతే కొంచెంవాడి, చిన్నబోయివుంది. రెచ్చగొట్టే, ఉద్రేకపరచే ఆహెచ్చరికగాని, లావణ్యంగాని యిప్పుడులేవు. దిగాలుపడిపోయి, వ్యథనొందుతూన్నట్లామె ముఖమే చెపుతూంది.

తనకు తెలియకుండానే ట్రాంబండివెనక పరుగెత్తేడు, విక్టరు. మనస్సులో యేదో ఆందోళన, ఉద్రేకం. ఇంక అక్కడ నిలబడలేక

పోయేడు. ఆమె, తాను ప్రేమించిన ఆయువతి, యిక్కడ జీవించి వుంటూంటే తాను ఆత్మవినాశం చేసుకోలేడు. అసంభవం,........కాని, ఈమె మరొకతె కాదుగదా! ఆమెగాక....అహఁ! ఆమే అయివుంటుంది, తప్పకండా........ఏమో? ఏం చెప్పగలం ?

డోలాందోళనతోనే మెల్లిగా నడచి తన బసకి చేరుకున్నాడు. తాళంతీసి, లోపలికి వెళ్లేడు. అతనికి భోజనం మాట జ్ఞాపకమే రాలేదు. తెల్లవార్లూ గదిలో అటూ యిటూ పచారు చేస్తూనే వున్నాడు. ఉదయమే లేచి, లీనా నివసించే వీధికి పోయేడు. ఆకాళరాత్రి, ఆమె కొరకై నిరీక్షిస్తూ నిల్చున్న సందుమొగ తిరిగేడు. అదిగో, ఆమె యిల్లు, ముందర లతామండపం, ఆమె గది, అదిగో........ఆమె! లీనామే!........

లీనా యెట్లవుతుందప్పా! నిన్న ట్రాములో తాను చూచిన యువతి వాకిట్లోకి వచ్చింది. తల వొంచుకునే నడుస్తూంది. కొంతదూరం వచ్చి యాంత్రికంగా తలెత్తి చూచేసరికి, ఆతడు! ఆమె చెక్కిళ్ళు పాలిపోయి, మొగం అరటి మొవ్వలా అయి పోయింది.

ఏమీ నిశ్చయించుకోలేక ఒక్క క్షణం ఆమె అట్లే నిల్చుని పోయింది. ఏదో నిశ్చయానికి రాకముందే ఆమె కాళ్లు ముందుకు తీసి కొని పోయి, జనసమూహంలో కలిపేసేయి. విక్టర్ కేకవేయబోవు వానిలా చేయెత్తేడు. ఎలుగు రాలేదు. మ్రాన్పడి నిల్చుని పోయేడు.

ఆమె పోయిన దిక్కు చూస్తూ, అట్లాగే యెంతకాలం నిల్చు న్నాడో, యెవరూ చూళ్ళేదు.

## 6

ఆరాత్రి, లీనా నదిలో పడిపోగానే కావలాదారుడు క్రింద పడవలోవుండి చూసేడు. ఆమెని పైకితీసి, హాస్పిటల్‌కి చేర్చేడు.

ఆమెకి తెలివొచ్చేక అడిగేరు, నీళ్ళలో యెట్లా పడ్డావని. ఆమె

నిజం చెప్పలేదు. ఘట్టం చివర నిల్చుని చూస్తూంటే కాలుజారి దబ్బున పడిపోయేనని చెప్పింది. తాను నిజం యెందుకు చెప్పలేదో ఆమెకీ అర్థం కాలేదు. తర్వాత ఆమె స్నేహితులతోనూ యదార్థం చెప్పలేదు. స్నానం చేసేటప్పుడు దెబ్బతగిలి, నదిలో మునిగిపోయేనని చెప్పింది.

అప్పటినుంచీ ఆమెలో ఏదో పెద్దమార్పు వచ్చేసింది. వెనకటి నవ్వు ఆమె ముఖాన్ని వదలిపెట్టి పోయింది! ఇప్పుడెవరూ ఆమె నవ్వుతూండడం చూడలేదు. వీధిలో నడిచేటప్పుడుకూడా పరధ్యాన్నంగా యెదటికే చూస్తూ నడుస్తుంది, ఏదో విడదీయలేని చిక్కు సమస్యను గూర్చి యేకాగ్రంగా ఆలోచిస్తూన్నదానిలా వుంటుంది.

తాను నదిలో యెట్లా పడిందీ నిజం దాచడమేగాక యదార్థం బైట పడిపోతుందేమోనని భయపడి పోయిం దెందుకని? తన్ను తానే యెన్నిసార్లో ప్రశ్నించుకుంది. తానట్లా యెందుకు చేసింది?............ సమాధానం దొరకలేదు.

అంత గాఢంగా ప్రేమించినవాడు హత్యగావించేటంతటి క్రూరంగా యెట్లు ద్వేషించేడా? ఈసమస్య మాటిమాటికీ ఆమెను వేధిస్తూంది. ప్రేమకూ, ద్వేషానికీ మధ్య సరిహద్దు లింతబలహీనంగా వుంటాయా? ఆకాపలావాడే సమయానికి రాకపోతే, ఆరాత్రి తాను మునిగి, చనిపోయేదే. తన్నాత డిప్పుడింకా ద్వేషిస్తూన్నాడా? పారమెరుగని ప్రేమ పరిణామమే ద్వేషాగ్నిగా మారగలదా?........

తనలో యిప్పుడు తీవ్రమైన భావసంఘర్షణ జరుగుతూన్నా ఆమె యెరుగనే యెరుగదు. కాని, ఒకటిమాత్రం నిశ్చయం. తనలో యింక విక్టర్‌పై ద్వేషం, అసహ్యం యేమీ శేషించిలేవు. అతను యిప్పుడెక్కడున్నాడో? ఏం చేస్తున్నాడో? అతనికేమీ ఆపద తటస్థించలేదుగద? ఈవేదనతో లీనా మనస్సు నిరంతరం వేగిపోతూంది,

అతడు మాస్కోలోనే వున్నాడని తెలుసుకుని ఆమె విభ్రాంతు

రాలై పోయింది. ఆప్తులంతా తాను చనిపోయిందనీ, తిరిగి రాదనీ అనుకుంటూంటే, హఠాత్తుగా వాళ్ళని సమీపించినప్పు డెంతటి మహదానందం కలుగుతుందో ఆమె కిప్పుడే తెలుస్తోంది.

ఒక రోజు విక్టర్ వుండే యింటికి వెళ్ళింది లీనా. అతడు కనిపించలేదు. లోపలికి వెళ్ళి, విక్టర్ భోగట్టా అడిగేటంతటి ధైర్యం ఆమెకు కలుగలేదు. తిరిగి వచ్చేసింది.

ఇటువంటి భయంకర వియోగం తరువాత తిరిగి అతన్ని కలుసుకుంటే సంతోషం ఏమిటి? ప్రయోజన మేమిటి? తనపిచ్చిగాని, తాను రక్షించబడిందని తెలిస్తే సంతోషించే పరమ ఆప్తుడా, విక్టర్ తనకి? బహుశా తనను పిశాచంగా భావిస్తాడేమో? నదిలో పడబోతూ చొక్కా పట్టుకున్న తన చేతుల్ని విదిలించి త్రోసేసినపుడు అతడు తనకళ్ళల్లో యేఅసహ్యభావాన్ని చూసేడో దాన్నే మళ్ళీ యిప్పుడూ చూస్తే యేమంటాడు? అమ్మయ్యో! విక్టర్‌కి కోపం వస్తుందేమోనని తలుచుకొంటేనే ఆమె వణకిపోయింది.

విక్టర్ తనతో మాట్లాడనక్కర్లేదు; చూడనూ అక్కర్లేదు. కేవలం తానాత డేమిచేస్తున్నాడో చూడగలిగితే చాలు. అదే పదివేలు. చనిపోయిం తర్వాత జీవుడు, తన ఆప్తు లేంచేస్తూన్నారో? ఎట్లా గడుపుతూన్నారో? చూడాలనుకున్నట్లుగా వుందామె స్థితి. అట్టి ఆత్మ, బ్రతికి వున్న బందుగుల ముఖాల్లో చెరుగని స్మృతి చిహ్నాల్ని చూస్తుందా? లేదా తన శరీరాన్ని సమాధి చేసేసి, నిత్యకృత్యాల్లో పడిపోయి, ఆచనిపోయిన వ్యక్తివంటి దెప్పుడూ లేదనేటంతటి మరపులోనికి జారిపోతాడా? అని చూడాలనే కుతూహలం కలిగివుంటే! లీనాకూడ అదేస్థితిలో పడిపోయింది.

అట్లా మరచి పోవడమే సంభవమైతే ఎంత భయంకరమైన సంగతది? అందరిచేతా ప్రేమించబడుతూ, బంధుమిత్రులతో కులా

సాగా వుంటారు. వియోగాల్లో దుఃఖం, సంయోగాల్లో ఆనందం; యింతలో చావు వస్తుంది........భరింపరాని దుఃఖం, ఆవేదన; పోయిన వారితో తామూ పోయినా బాగావుండేదే అనేటంతటి శోకావేగం........ బంధుమిత్రుల అనునయాలతో, ఊరడింపులతో, బలవంతాన యింటికి రావడం; భోజనమజ్జనాదులతో మళ్ళీ తన బొందిని కాపాడుకోడం; యింక ఆమర్నాడు యెవరూ బలవంతపెట్ట నక్కర్లేదు. మామూలుగా నిత్యకృత్యాలన్నీ జరిగిపోతాయి. ఫలానావారు చనిపోయేరు; యింక లేరు; యిది సర్వజనాంగీకృతం అయిపోతుంది. తప్పిజారి కొందరి కింకా జ్ఞాపకం వుంటే అప్పుడప్పుడు తలుస్తుంటారు. కంట తడిబెడ తారు. అంతే. కాని, ఎంత బెంగపెట్టుకున్న వారూకూడ ఏదో చిన్న అవాంతరం వచ్చేసరికి మరిచిపోతారు. భర్తృవియోగదుఃఖంలోకూడా, ఏచిన్నవస్తువో, ఏగ్లాసో క్రిందపడి పగలడం చూసి, ఒక క్షణిక మాత్రమైనా ఆదుఃఖం మరిచిపోతారు. ఆ భిన్నవస్తుస్మృతి, భర్తృ స్మృతిని ఒక క్షణికం వరకైనా మరిపించగలిగిందే! బ్రతికివున్న వ్యక్తి ప్రేమతరంగాల్ని, స్మృతితరంగాల్ని నిరంతరం వ్యాపింప చేస్తుంటాడు. అవ్యక్తిని మరిచిపోవడం యెట్లా సాధ్యం? చనిపోయిన వాళ్ళు తమర్ని జ్ఞాపకం వుంచుకొని తీరాలని ఎట్లాగూ బలవంతం చేయలేరు. అందు చేత మరిచిపోయినా ఫర్వాలేదు!

ఈ ఆలోచనలతో లీనాకి ఒంటరితనంగా ఉండడంలో బాధ అను భూతమైంది. అటువంటి ఒంటరితనం నుంచి తానిప్పుడెట్లా తప్పించుకో గలదు? ప్రేమించిన వాళ్ళు మరణించినప్పటి దుఃఖం కూడా, ఏవస్తువో పగిలి పోయినప్పుడు ఒక్క క్షణమైనా మాసిపోతూందంటే యింక యీభూమిమీద ప్రేమాస్పదులైనవాళ్లంటూ ఎవరున్నారు? వారనీ, వీరనీ యీప్రాకులాటంతా దేనికి?

తాను నిజంగానే చనిపోయి, మళ్ళీ యెట్లో బ్రతికి వచ్చేననే

భావిస్తూంది, లీనా. కాని, తనకోసం యెవరూ దుఃఖించినట్లు లేదే? తనకోసం యెందరో విచారిస్తారనీ, కొందరేనా మరీ బెంగపెట్టుకుంటా రనీ అనుకోడం యెంత బాగుంటుంది? ఆమె విషయంలో అట్లాంటి దేమీ జరిగినట్లు లేదే? తన పరిచితులు మామూలుగానే పలకరించేరు. ఏదో పుట్టెడు ఆపదలోంచి బైటపడిందనే సానుభూతికూడా వాళ్ళ మాటల్లో వ్యక్తం కాలేదు. నిజంగానే తను చచ్చిపోయి వుంటే "అరే! ఎంత విచారకరం! అంత చక్కనిపిల్ల. చచ్చిపోవడమా?" అని వుండే వాళ్ళు. అంతే. అదైనా ఆమాట వచ్చినప్పుడు. తర్వాత అంతా మామూ లుగా యెవరి పనిపాట్లువారివే. వచ్చే వేసవిసెలవులు యెట్లా గడపాలా, మెస్‌లో రాత్రికి యేమి స్పెషల్‌చేయించాలా,—యిట్లాటివే చర్చించు కుంటారు. లోకం అంతా యింతే. తాను మరో ప్రపంచంలోనుంచి చూసి, యిదంతా తెలుసుకుంటూన్నట్లుగా వుంది, లీనాకి. ఈవిశాల మానవప్రపంచంలో తనను జ్ఞాపకం వుంచుకోవలసిన వాళ్ళు ఒకరూ లేరని తెలుసుకుంది.

మరణానంతర దృష్టితో చూడడంవల్ల లీనాకి ఒక కొత్తవిషయం బోధపడింది. తనెట్లా పోయినా యెవరకీపట్టదు; తనెవరికీ అక్కర్లేదు. ఈ ఆలోచన ఆమెను రక్కెస కంపలా పట్టుకుంది.

ఆరోజు వీధిలో విక్టర్‌ని చూసినప్పుడు లీనాకు మొదట యేదో ఆరాటం కలిగింది. అతను కనిపించకుండా పోయిం తర్వాత జ్ఞాపకం వచ్చింది, తానాతని ముఖమైఖరినికూడా చూడలేదని!

## 7

ఆసమావేశం తర్వాత విక్టర్ రోజూ వెళ్లి, వీధిలో నిలబడే, ఆమె కిటికీవైపు చూస్తూ, నిలుచునేవాడు. ఒక్కొక్కరోజు గంటలతర బడి అట్లాగే వుండిపోయేవాడు. ఒకసారి కిటికీతెర కదిలింది. ఎవరివో

హస్తం కిటికీ తెరవాలనుకుంటున్నట్లూ, మళ్ళీ యెందుకో మానినట్లూ గమనించేడు, విక్టర్.

అతని గుండెల్లో రైళ్ళు పరుగెత్తేయి. కణతలు రక్తపుపోటుకి పగులుతాయా? అనిపించింది. చెవులు దిబ్బట్లువేసినాయి. రాతిబొమ్మలా నిల్చుని, అటువైపే చూస్తూన్నాడు. "ఆమెని చూడగలనా?" ఈప్రశ్న ఒక్కటే అతని బుద్ధినంతనూ ఆక్రమించుకుంది. కాని, తెరచాటున వున్నవాళ్ళని చూడడమెట్లా?

ఓరోజున వీధిలో వెడుతూ, విక్టర్ సైమన్ని కలుసుకున్నాడు. ఏమైనా చెపుతాడేమోనని అతనివైపు చూసినా ప్రయోజనం లేక తానే ముందుగా కదిపేడు.

"లీనాని యీమధ్య కలుసుకున్నావా? సైమన్!"

"కలుసుకుని చాలరోజులైందోయ్! లీనాకి చాల సుస్తీచేసింది; నదిలో స్నానం చేస్తూ, మునిగిపోయింది, పాపం. పునర్జన్మ అన్నమాట. ఆమె యిప్పుడెక్కడికీ రావడమేలేదు." అన్నాడు, సైమన్.

విక్టర్కి స్పష్టమైంది. లీనా తన నేరాన్ని కప్పిపుచ్చింది. ఏం? ఎందుచేత?

ప్రయత్నించి రెండోసారి ఆమెను మళ్లీ కలుసుకున్నాడు. ఆమె యింటివైపే వెడుతూంది. కంగారుపడుతూ, టోపీ తీసి చేత్తో పట్టుకున్నాడు. పాలిపోయిన లీనా చెక్కిళ్లు యెర్రనైనాయి. అతని ముఖంలోకి సూటిగా చూడలేక యెక్కడో పైకి చూసింది. పరధ్యాన్నంగా యిద్దరూ కలిసి నడవడం ఆరంభించేరు. లీనాయే ముందు మాట్లాడింది.

"నువ్వు పట్నంలో లేవాఏమిటి?"

"లేను. మావూరువెళ్లేను."

మెల్లిగా నడుస్తూ యేవేవో ఆషామాషీ కబుర్లుచెప్పుకుంటున్నారు. చాలరోజులతర్వాత అప్పుడే కలుసుకున్నవాళ్ళకిపలెనే యేదో బాతాఖానీ

వేస్తున్నారేగాని గతాన్నిగూర్చి ఒక్కమాటా లేదు.

సంభాషణ సాఫీగా నడవడంలేదు. ఏదో సంకోచం, ఉద్రాృంతత్వం యిద్దరిలోనూ కనిపిస్తూంది. ఒకరినొకరు నూతన దృక్కోణాన్నుంచి జాగ్రతగా సమీపిస్తూన్నట్లుంది. ఏదో అడుగుతూ, జవాబుకై ఆమెవైపు చూసేసరికి లీనా ముఖం సిగ్గుతో యెఱ్ఱబడింది. మాటల్లోబడి వారు తమకు తెలియకుండానే నడుస్తూన్నారు. గోరీల దొడ్డిదగ్గిరికి వచ్చేక చూసుకున్నారు, ఆశ్చర్యంతో, ఎంతో దూరం వచ్చేసేమని. లెక్కలేని గోరీరాళ్ళు, మధ్యమధ్య కొండరావిచెట్లు, చుట్టూ చిన్న పిట్టగోడతో నున్న ఆగోరీల దొడ్డిని చూసేసరికి యెందుకనో ఆనాడు నదీఘట్టాన జరిగినది జ్ఞాపకం వచ్చింది. అటువంటి విషమసంబంధాలు యింక తమ మధ్య యిప్పుడుకూడా వుండడం సంభవమా ? అనే ప్రశ్న విక్టర్ మనస్సులో తటాలున మెరుపులా మెరిసింది.

"అబ్బే! అట్లాంటిదింక అసంభవం!" తనకు తానే సమాధానం చెప్పుకున్నాడు.

లీనా తనకు సైమన్‌మీద సదభిప్రాయం వుందని చెప్పినా ఆమె మీద యిప్పుడాతనికి కోపం రాదు. ఇప్పుడింక అట్లాంటిపని జరగదు. నిస్సందేహంగా........

ఏం? ఏమి జరిగింది? ఈ యిద్దరు వ్యక్తుల్లోనూ యీకొద్దివారాల్లో వచ్చిన మార్పేమిటి ?

లీనా ఆగి, ప్రహరీ దగ్గరలో యేవో పువ్వులుంటే, కోయడానికి వంగింది. వెనుక పచ్చని చెట్లు, క్రింద సిపాయిల్లా సమాధిరాళ్ళూ, సిలువలూ నిలబడి వున్నాయి. సూర్యకిరణాలు, కళ్లు పొడుస్తున్నాయి. ఈ పరివారంలో వంగిన లీనాను చూసేసరికి విక్టర్‌కి యేదో జ్ఞాపకం వచ్చింది. కాని, అదేమిటో స్పష్టం గాలేదాతనికి.

లీనా పువ్వులగుత్తి చేత్తో పట్టుకుని నిల్చుంది. ఆమె రాకచూస్తూ,

విక్టర్ టోపీ చేత్తో పట్టుకుని, నిల్చున్నాడు, రోడ్డుమీద.

విక్టర్ జుట్టువంక చూసింది, లీనా. ఆమె చెయ్యి వణికి, పువ్వుల గుత్తి జారి, క్రిందపడి పోయింది. అతని జుట్టువైపు చేత్తో చూపుతూ;

"ఏమిటిది?" అంది.

"ఇది....ఇది........" విక్టర్‌కి మాటలు తడబడినాయి. అతని ముఖం సిగ్గుతో యెర్రబడిపోయింది. మాట్లాడ కూరుకున్నాడు.

అతని జుట్టువైపు చూస్తూంటే, లీనా కళ్ళలో నీటిబిందువులు మిలమిలా మెరసిపోయేయి. ఏమీ మాటాడకుండా అతని మెడలో రెండు చేతులూ వేసి, నెరసిన జుట్టును ముద్దెట్టుకుంది, లీనా.



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA111B182 |
| పుస్తకం పేరు | వాద్యా |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 117 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | pragathi |
| పేజీలు విడదీసినది | somya |
| స్కాన్ చేసినది | Praveen |
| పరీక్ష చేసినది | RAMYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |